" పడతి జీవితానికి పసుపుకుంకుమే [illegible] ఆ సౌభాగ్యాన్ని నిలబెట్టడానికి
మూడుదారులు పట్టిన ముగ్గురి జీవితాల మూగబాధే యీ గాథ ! "




శ్రీ కృష్ణసాయి ఫిలింస

# మనసే మందిరం

కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వం · శ్రీధర్

నిర్మాత యర్రా అప్పారావు

స్టూడియో
శ్రీ సారథి స్టూడియోస్
(హైదరాబాద్)

..శ్రీ ఫిలింస్..

NVKR

## కథలు

9—9—66 సంచికలో 1, 2 పొరపాట్లు ఉన్నాయని తెల్పుటకు విచారిస్తున్నాను

"సరోజ" అన్న కథలో సరోజ తండ్రి—

"ఎక్కడికి వెళ్ళావమ్మా?" అని అడిగితే,

"మనింట్లో అద్దెకొచ్చారే వాళ్ళ దగ్గరికి వెళ్ళాను నాన్నా" అని జవాబు యిచ్చింది కానీ "యివ్వాళ యింత ఆలస్యమయిందే" అన్న వాక్యము దాని వెనుకనే ఉంది అసలు మొత్తము వాక్యము ప్రశ్న యిలా ఉండా లనుకొంటాము, 'ఎక్కడికి వెళ్ళావమ్మా? యివాళ యింత ఆలస్యం అయిందేం? అని సరోజ నాన్న ప్రశ్నిస్తే "మనింట్లో అద్దె కొచ్చారే వాళ్ళ దగ్గరకు వెళ్ళాను నాన్నా" అని సరోజ జవాబు యిస్తుంది అని ఉండాల్సింది బహుశ యిది అచ్చు పొరపాటు అయి వుండవచ్చును

"గంజి—అన్నం" కథలో రంగయ్య తన గుడిసే వెనకాల కోడిని చంపి, దాని ఈకలు అన్నీ, పీకివేసి గిన్నెలో వేసి, గుడిసెలోకి వస్తుంటే అతని భార్య లేచింది" అని ఉంది దీన్నిబట్టి రంగయ్య కోడిని చంపాడని అర్థమేస్తుంది కానీ మరల అదేకాలములో "గిన్నెలో పెట్టిన కోడి" కూకూ అని సంతోషాన్ని ప్రకటిస్తూన్నట్లు అరవసాగింది అని ఉంది చచ్చిపోయిన కోడి ఎలా "కూ, కూ అని అరుస్తుందో పాఠకులకు అర్థంకాదు. దీని భావమేదో పత్రిక ద్వారా సందేహము లను తీరుస్తారని ఆశిస్తున్నాము.

అడిదం విజయప్రభాకర్ (తెనాలి)

* * *

"అడ్డంతిరిగిన కథ" యెంతో బాగుంది సంస్కరణ, సంఘోద్ధరణ, యింటు పదు గురి ముందు డబ్బా వాయించుకొంటూ, ఆ త్యాగ మేదో తాము చేయవలవసిస్తే మనసు మార్చుకొని, వూసరవెల్లిలా రంగులు మార్చే మహానుభావు లెందరో వున్నారు చెప్పేవాటికి, చేసేదానికి, యెలాటి సంబంధ ముండదు అలాంటి కోవకే చెందినా 'మురళి' పాత్ర చాల చక్కగా వుంది. రచయితలు వివారి శాలివాహన గార్లకు నా అభినంద నములు. జి ఎం రావు (తాల్మడుగు)

## కార్టూన్

మీరు 16—9—66 వ తేదీ సంచిక 64వ పేజీలో ప్రచురించిన 'టూన్సులో టూనిస్టు' అన్న శీర్షికలో "డామిట్ ఇదే కార్టూన్ను నేనో ఇంగ్లీషు మాగజీన్‌లో మరి కాపీ చేసి పంపా. 4—3—66 పత్రి కలో ఒసారి 5—4—66 పత్రికలో ఒక సారి పడింది" అన్న సంభాషణ వున్నది. 4—3—66 వ తేదీన పత్రిక వస్తే, వారముల ప్రకారం 1—4—66 లేక 8—4—66 వ తేదీల పత్రికలు వచ్చును కాని 5—4—66 వ తేదీ పత్రిక రాదు.

జయశ్రీ (గురజ)

## వ్యాసాలు

"ఆధునిక దివాలలో అతిధులు" చదివిన తరువాత ఈ ఉత్తరం రాయాలనిపించింది. ఆవిడ చక్కగా విడమర్చి రాశారు యింకా అలాంటివి కొన్ని వున్నాయి.

మగవాళ్ళలోనూ ఆడవాళ్ళలోనూ అటు వంటి వాళ్ళు ఉన్నారు ఎటొచ్చి ఆడవాళ్ళది మరో రెండుపాళ్ళు ఎక్కువ.

మొన్న మా స్నేహితురాలు ఒకర్తి వచ్చి చెప్పింది, వాళ్ళింటికి వచ్చిన బంధువొకా యిన ఇలా అనాట్ట భోజనం చేస్తూ వుండగా "మా ఆవిడండీ ఈ కూరే ఎంత ఫస్టుగా చేస్తుందనుకున్నారూ? ఇంకా దీంట్లో ఏదో తక్కువయి వుండాలి కదమ్మా" అని అక్కడే కది "నాకు సరిగా వంట రాదండి" అని సర్ది పెట్టింది.

వచ్చినవాళ్ళకి బాగా చేసి పెట్టాలని, బావుందంటూ తింటే చేసిన కష్టం తెలియ దని, వాళ్ళకీ వుంటుంది పొరపాటు వస్తే రావచ్చు, లేదా వాళ్ళావిడ అంతకన్న బాగా వండచ్చు మనం పరాయి చోటికి వచ్చాము కదా అని సర్దిపెట్టుకోవాలి అలా వాళ్ళ మొహం ముందరే అని వాళ్ళని బాధ పెట్ట కూడదు

యింకా ఇలాంటి వాళ్ళు చాలా కొంచెం పెద్ద ఉద్యోగస్తుని భార్య వస్తుంది అబ్బా ఇంత ఉక్క పోస్తుంటే మీరు ఎలా వుండ గలుగుతున్నారు? ఫ్యాన్ ఒకటి తీసుకో లేదా? మీరు ఇక్కడికి వచ్చి చాలారోజు లయినట్లుంది, ఫర్నిచర్ సెట్టు తీసుకోలేక పోయారూ?" ఇప్పుడు కొత్తరకం చీర లొస్తున్నాయి, చాలా బావుంటున్నాయి నేని మధ్యే 60 రు. ఇచ్చి కొనుక్కున్నాను" అనో, వాగ్ధింగులిస్తుంది, వింటూ వుంటే వంటిమీద ఏవో పాకుతున్నట్లు వుంటుంది. ఏం జవాబివ్వడానికీ తోచదు

అందుచేత ఎక్కడికి వెళ్ళినా ఒకటి రెండురోజులుండటం, పరిస్థితు లెలాఉన్నా ఎదుటి వారి మనసుకు కష్టం కలగకుండా మసులుకుని బయటపడితే వాళ్ళకి మనం వెళ్ళమని సంతోషంగా వుంటుంది. మళ్ళీ పిలయినప్పుడు రమ్మని పిలవడానికి ఆస్కారం వుంటుంది అంతేకాని ఎప్పుడు పోతారా? అని వాళ్ళకి అనిపించేటట్లు మనం మసలుకో కూడదు. అటువంటి వాళ్ళకి వ్యాసం చాలా ఉపకరిస్తుంది

సావిత్రీ జోగారావ్. బండముండ ఒరిస్సా.

---

పైవారమే ప్రారంభం!

# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజ్

రచన

## ఆర్. వెంకట్రామన్

(మద్రాసు పరిశ్రమల మంత్రి)

ప్రత్యేక వ్యాస శీర్షిక!

---

ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1966 దీపావళి కథల పోటీ

ఎప్పటివలే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించబోతున్నదని తెలుపటానికి సంతోషిస్తున్నాము. కథకులందరూ ఎప్పటివలే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 1100

## రెండవ బహుమతి రు. 750

## మూడవ బహుమతి రు. 500

## నిబంధనలు

1 కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోపాటు రచయిత అది తన స్వంత రచనేననీ దేనికీ అనువాదంకాని, అనుసరణకాని కాదనీ హామీపత్రం పంపాలి. ఈ హామీ వేరే కాగితంమీద కాక కథ వ్రాతప్రతిమీదనే రాసి ఉండాలి.

2 కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3 వ్రాత ప్రతిమీద 'దీపావళి కథల పోటీకి' అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు పూర్తి చిరునామా కూడా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్ బుక్ సైజుకి రెండురెట్లు) పేజీలకు మించరాదు.

4 కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టివీధి, మద్రాసు—1' కి పంపాలి.

5 పోటీ గడువు తేదీ 30—9—1966. ఆ తేదీ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 11—11—1966 తేదీ గల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7 పోటీ తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపటానికి వీలులేదు.

8 వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనే వారు తమ రచనలతో తపాలా బిళ్ళలు అతికించిన స్వంత చిరునామాగల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆవిషయం ప్రచురించేముందు తెలుపుతాము.

# ఉత్తరాలు

## పాఠకుని ఉత్తరానికి జవాబు

ఆంధ్ర సచిత్రవారపత్రిక 8—7—66 సంచికలో ఆలియాబేగం అన్నాతిగారి ఉత్తరం చదివాను. అందులోని నాలుగు ప్రశ్నలకూ నా జవాబు 'అవును!'

మన పట్టణాలు కొన్ని విషయాలలో ముందడుగు వేశాయి. అభివృద్ధి చెందాయి. పట్టణ వాతావరణానికి సమీపంలోవున్న పల్లెలు కొంతవరకు పట్టణాలవల్ల ప్రభావితం అయ్యాయి. కాని మారుమూల పల్లెలు మునుపటికంటే చితికిపోయాయి. మునుపటికంటే అధోగతి పాలయ్యాయి.

మన పల్లెలు అభివృద్ధి చెందాయనీ, ఒకనాటికంటే ఈనాడు దేశం ఎన్నో విధాల పురోగతి సాధించిందనీ చాలామంది అనుకొంటున్నారు, నమ్ముతున్నారుకూడా. అయితే సత్యం అలాలేదు. వ్యక్తులు పురోగమించారు. అభివృద్ధి చెందారుకాని, సమాజం పురోగమించలేదు. అభివృద్ధి చెందలేదు. మన పల్లెలు ఒకనాడు ఏ స్థితిలో వున్నాయో, ఇప్పుడూ ఆస్థితిలోనే ఉన్నాయి. పల్లె ప్రజలలో ఏ కొందరో మునుపటిస్థితిని అధిగమించారు. సంఘం ఒకవ్యక్తి అయితే, ఆవ్యక్తి శరీరంలోని ఏ అవయవమో, విపరీతంగా పెరిగిపోతే ఎంత వికారంగా వుంటుందో వూహించవచ్చు. కావలసింది సమష్టిన పెరుగుదలకాని, వికారమైన పెరుగుదల కాదు.

సత్యాలు అసత్యాలుగా కనిపించే పరిస్థితి ఎంతో దూరంలో లేదనే అనిపిస్తుంది. సత్యం ఎబ్బెట్టుగా అనిపిస్తే అనిపించవచ్చు. అయినా సత్యం సానుభూతిలో స్వీకరించాలి. 'ప్రియమ్ బ్రూయాత్ సత్యమ్ బ్రూయాత్ న బ్రూయాత్ సత్యమప్రియమ్' అన్నట్లుగానే ఈనాడూ అప్రియమవుతుందని సత్యం చెప్పకుండా వుండటం న్యాయంకాదు.

నా వ్యాసంలో విషయగతంగా కల్పన లేదు. వాస్తవాలే వ్రాశాను. ప్రత్యక్షంగా అనుభవిస్తున్నవారి అనుభూతులు ప్రత్యేకంగా చూచి వ్రాశాను. కల్పనా జగద్విహారంకంటే వాస్తవతా సందర్శనం శ్రేయోదాయకంకదా!

—రవి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 30—9—'66
పరాభవనామ సం॥ భాద్రపద మాసం బ॥ పాడ్యమి
సంపుటము : 59 సంచిక : 3
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్త రేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర సంవత్సర చందా | 16.00 |


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దాని రచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదని హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీ లేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్ర వారపత్రిక

# మనలో మాట

'నిరుద్యోగపర్వం' తర్వాత ఉద్యోగపర్వం ఎలా ఉంటుందో శ్రీ శేళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణగారు 'చిరుద్యోగపర్వం'లో చెప్తారు. దానిని ఈ వారం మధ్యపేజీలలో ప్రారంభిస్తున్నాము ...

*　　　*　　　*

తిబోర్ స్జామ్యులీ అసలు హంగరీ దేశస్థుడు. కొంతకాలం 'అక్రా'లో ఎన్క్రుమా స్థాపించిన 'అయిడియొలాజికల్ ఇన్‌స్టిట్యూట్'కి సలహాదారుడుగా పనిచేశాడు. ఈవారం, సోవియట్ రష్యాలో ఒక విషయాన్ని గురించి ఆయన రాసిన వ్యాసం లండన్ 'స్పెక్టేటర్'లో పడింది. దానిని ఫోరం వరల్డ్ ఫీచర్స్ వారిద్వారా ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకి అందచెయ్యగలుగుతున్నాము. నేడు చైనాలో 'ఎర్ర రక్షకు'ల పరివర్తనకీ ఈ వ్యాసానికీ అన్వయం కుదుర్చుకొనటం అంత కష్టంకాదేమో ...

*　　　*　　　*

స్వర్ణ నియంత్రణవల్ల సాంఘిక—ఆర్థిక సంస్కరణాలని తీసుకురావటానికి ప్రభుత్వం నిశ్చయించుకున్నప్పటికీ ఈ చట్టం అంతగా ప్రజాదరణ పొందినట్లు కనిపించదు. ఇటీవలే దానిని బాగా సవరించారు. ఈ సందర్భంలో శ్రీ సి. డి. కె. మూర్తి సేకరించిన అభిప్రాయాలని సచిత్ర వ్యాసంగా ఈ సంచికలో ప్రచురిస్తున్నాము ...

*　　　*　　　*

దీపావళి కథలపోటీ గడువు పెంచమని కొందరు రాస్తున్నారు. కాని ప్రత్యేకసంచిక సకాలంలో వెలువడాలి కనుక ఇది సాధ్యంకాదు !

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'గూఢచారి 116'లో జయలలిత.


మైసూర్
కేరళ
ప బెంగాల్
ఒరిస్సా
నే నెప్పుడూ యింతగా బురద పూయించుకో లేదు
వామపక్ష సిపిఐ
అబ్దుల్లాను వదిలిపెట్టండి అబ్దుల్లాను వదిలిపెట్టండి
చైనా చిలక
చైనా నాయకత్వం
చైనా రెడ్ గార్డులు
OOMMEN
తన పెంపుడు జంతువుని అతను ఆపగలడా?
చైనా ప్రజలు

# ఇనప తెరవెనక కామమూ, నైతిక విలువలూ!

## తీ బో ర్ షా మ్యు లీ

ఇరవయ్యవ శతాబ్దంలో నాగరకత కదంతొక్కుతూ ముందుకి సాగిపోతోంది భూగోళం మీద ఉండే చోట్లన్నీ దీని ప్రభావానికి లోనవుతున్నాయి ఖండాలేమిటి ద్వీపాలేమిటి ఇంకా ద్వీపాంతరాలేమిటి సూయెజ్ కు తూర్పు ప్రాంతాలు సూయెజ్ కి పడమర ప్రాంతాలలాగ మారిపోతున్నాయి వస్త్రధారణా అభిరుచులూ నైతిక విలువలూ అన్నీ పరస్పరంగా పోలికలు పెంచుకుంటున్నాయి అన్నిటికన్నా నైతిక విలువల సంగతి ప్రత్యేకంగా చెప్పాలి మారినోస్కి మార్గరెట్‌మీడ్ ల వంటి వారు మారుమూలల ప్రదేశాల వారి 'కామ వ్యసనాలని గురించి పుస్తకాలు రాసే రోజులు పోయాయి ఈ రోజు మానవ జాతి శాస్త్రజ్ఞుల పాశ్చాత్యదేశాల విలువల పతనాన్ని గురించి మాత్రమే రాయ గలుగుతున్నారు అవి వారికి రుచించినా, రుచించకపోయినా ఎవరూ లెక్కచెయ్యరు ఒకప్పటి టాబూ' (Taboo)లు, కామోపదేశాలు ఏమయినాయి?

కాని ఈనాటికీ ఒక దేశంలో మాత్రం 'లైంగిక విప్లవం' అని మనం వర్ణించే విప్లవం ఇంకా జరగలేదు ఈ దేశంలో కుటుంబ నియంత్రణం 'క్లినిక్' లు లేవు యువతులకి సలహా నిచ్చే పత్రికలు లేవు కిన్సి రిపోర్టులు తయారు చేసే నిపుణులు లేరు (ఉన్నా రాయరు), దిగంబర నృత్యాలు వాడుకలో లేవు ప్రకటనలో స్త్రీరూపం ఆకర్షణని వాడుకోరు చిన్నపిల్లలకి లైంగిక విజ్ఞానంలో శిక్ష ఎవ్వరూ బహిరంగ ప్రదేశాలలో ముద్దు లు ఇచ్చి పుచ్చుకోనటం ఇక్కడ అరుదు అచ్చులో, తెరమీద, రంగం మీద లైంగిక విషయాల ప్రసక్తిని జాగ్రత్తగా పరిశీలిస్తారు ఎవరో కొందరు పండితులకి తప్ప మామూలు జనానికి ఫ్రాయిడ్ అనేమాట తెలిసీ స్ఫురింపచెయ్యదు ఈ ఆనందదాయకమయిన పరిస్థితి వలభయి సంవత్సరాలుగా జరుగుతూనే ఉంది జనాభా పెరుగుదల కనక లేకపోతే ఈ విషయాన్ని గురించి అందరూ మర్చిపోయారా అనే అనుమానం రావచ్చు ఇది ఏ దేశమో మీరు గ్రహించే ఉంటారు—సోవియట్ యూనియన్

ఒకవిధంగా చూస్తే 'లైంగిక విప్లవం సోవియట్ యూనియన్‌లో పాతచింతకాయ పచ్చడి పశ్చిమదేశాలలో జరగకముందే తమ విప్లవాన్ని జరుపుకున్నారు 1917 లో రోడ్ల మీద 'సిగ్గు నశించాలి' అనే పోస్టర్లని పట్టుకుని పురోగమనవాదులు నడిచే రోజులు, సభలలో కవులు బూతు పద్యాలు చదివే రోజులు, 'ఫ్రీలవ్' ఉద్యమాలు, తేలిక విడాకుళ్లు, ఎబార్షన్‌లుఅనుకుంటే ప్రారంభమయ్యే రోజులు గడిచాయి 'రష్యాలోని



'పడతీ—పరువమూ'

ఫొటో : ప్రభాకర్ మహాడిక్.

# ఇనప తెర...

లైంగిక విప్లవానికి తక్కిన విప్లవాల గతి పట్టింది విప్లవానికి ఎదురుగా తిరుగు విప్లవం లేచింది 'సభ్యత'దే పైచెయ్యి అవి పించారు అధికారులు అయితే అసలు విప్లవం అనేది వృథా కాలేదు. బహిరంగంగా వాటిని గురించి చర్చించనంతకాలం ఎన్నో పనులు చేస్తూనే ఉండవచ్చునని కొందరు తెలుసుకున్నారు

## ట్రాక్టర్ పట్ల ప్రణయం

జనసామాన్యం మొత్తంమీద పాశ్చాత్య దేశాలలోని నీచ వ్యసనాలని వదులుకున్నదని అధికారవర్గాల వారు ప్రచారాలు చేస్తూనే ఉన్నారు ఈ వ్యసనాలకి కావలసిన శక్తి నంతా సోషలిస్టు పునర్నిర్మాణానికే వాడుతున్నారని మనం తెలుసుకుంటాము అందుకనే "అబ్బాయి అమ్మాయిని ప్రేమిస్తే అమ్మాయి ట్రాక్టర్‌ని ప్రేమించింది" అనే వస్తువు కల కథలు చాలా వెలువడ్డాయి పెట్టుబడిదారీ వ్యవస్థలో కుళ్లిపోతున్న పాశ్చాత్యదేశాలలో జరిగే పాపాలని గురించి సోవియట్ విలేఖరులు ఇంకా రాస్తూ ఉంటారు

'ప్రొఫ్యూమో' వ్యవహారం సందర్భంలో వీరి ఆనందానికి అంతేలేదు ఇదంతా పాశ్చాత్య సంస్కృతి చిహ్నమే అన్నారు కాని జి ఎఫ్ అలెక్సాండ్రోవ్ అనే సోవియట్ మంత్రిని (సంస్కృతిశాఖ) కొన్ని విడూరమయిన 'ప్రణయ కలాపాలు' ఏర్పరచినందుకు 1955 లో తీసివేశారు. మంత్రిగారిని సంతోషపెట్టి సినిమాలో ప్రవేశం పొందటానికని కొందరు యువతులు దిగంబరంగా నాట్యం చెయ్యవలసివచ్చిందిట శ్రీ అలెక్సాండ్రోవ్ వ్యసనాలని గురించి అందరికీ తెలిసినా ఆయన శ్రేయోభిలాషి శ్రీ మాలెంకోవ్ పదవినుంచి పడిపోయేదాకా ఈ సంగతిగురించి బహిరంగంగా చెప్పుకునే వారుకాదు అలాగే శ్రీ బెరియా పడిపోగనే ఆయనకి చిన్నవయస్సులో ఉన్న ఆడపిల్లల పట్ల ఆసక్తిని గురించి ఎవరూ ఏమీ బయ

టికి ఆశ్చర్యంకాదు. ఈ రకం గొడవేకి ప్రసక్తి దేశంలోని 9000 పేపర్లలో కాని, 4000మ్యాగజీన్లలోకాని వచ్చేవేకాదని వేరే చెప్పనవసరంలేదు.

## అందరూ అంతే

'బూతు సాహిత్యం' సంగతి తీసుకోండి. ఇద్దరు ప్రేమికులు ఒకముద్దుని మించి పట్టు రాస్తే చాలు రచయిత బూతు రచయిత అయినట్లే. ఒకప్పుడు బోరిస్ పాస్టర్నాక్ కూడా 'బూతు రచయితే' కాని ఆధునిక రచనల్లో 'అసభ్య' విషయాలని తొక్కేస్తూ పాతరచయితలపుస్తకాలని సంపూర్ణంగా అచ్చు వెయ్యటంలో అర్థం ఏమిటి? ఈనాటికీ 15—20 సంవత్సరాల మధ్య వయసు పిల్లలు మొపాసా రచనలనే ఎక్కువగా చదువుతారు.

ప్రచారం ఎలా ఉన్నప్పటికీ మాస్కోలో జీవితం లండన్‌లో జీవితానికి అంత భిన్నంగా ఉండదు. గృహవసతి సౌకర్యాలు తక్కువగా ఉన్నప్పుడు ఒక కుటుంబం అంతా ఒకే

## ఇనప తెర...

గదిలో ఇరకవలసి వచ్చినప్పుడు అబ్బాయి అమ్మాయిల హాస్టళ్లు పక్కపక్కనే ఉన్నప్పుడు కొన్ని పరిణామాలని చూసి ఆశ్చర్య పడటంలో అర్థంలేదు. అంతేకాక రష్యాలోని గృహవసతి సౌకర్య లోపాలు, వాతావరణం తీవ్రత ప్రేమికుల ప్రగతికి అవరోధాలు అని గుర్తించాలి. "సంస్కృతి నిలయాలు", "యూత్ క్లబ్"లు దుర్వినియోగాలకి లోనవుతున్నాయని సోవియట్ పత్రికలు అప్పుడప్పుడు రాస్తున్నాయంటే అందులో ఆశ్చర్య మేమీలేదు.

## అధికార్ల వర్గాల ధోరణి

సోవియట్ నవలలలో, సినిమాలలో ప్రేమ ఎప్పుడూ పవిత్రంగా ఉంటుంది. వివాహం, సంతానం వీటితో పుష్పిస్తూ ఉంటుంది. ఒకవిధంగా ఇది సరయినదే— సోవియట్ చట్టం ప్రకారం వైజాన్యం అనేది ఉంది. వివాహం కాని తలిదండ్రులకి పుట్టిన బిడ్డ 'బర్త్ సర్టిఫికేట్'లో తండ్రి పేరు బదులు ఒకగీత గీస్తారు.

ఇక పడుపు వృత్తి. ఇది 30 సంవత్సరాల క్రితం నశించిందని అంటారు కాని మాస్కో సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు పక్క, హోటల్ మెట్రోపోల్ పక్క సాయంత్రం పూటల నడిస్తే ఎంతదాకా నశించిందో తెలుస్తుంది. పోలీసువారు కూడా పడుపుకత్తెల విషయంలో కొంత ఉదారంగా ప్రవర్తిస్తారు. విదేశీయులు చిక్కుల్లోపడితే మాత్రం అల్లరి జరుగుతుంది. 1957 అంతర్జాతీయ యువజనోత్సవాల తర్వాత కొన్ని వందలమంది అమ్మాయిలని సిగ్గు లేకుండా ప్రవర్తించినందుకు తలలు గొరిగి మాస్కోనుంచి బహిష్కరించారు.

ఒక్కమాటలో చెప్పాలంటే, అధికార వర్గాల వైఖరి ఎలా ఉన్నప్పటికీ కామము సోవియట్ యూనియన్‌లో ప్రజాదరణ కోల్పోలేదు అధికారవర్గాలు కూడా ఈ సంగతి అప్పుడప్పుడు ఒప్పుకుంటూ ఉంటారు. లిటరాటూర్నయా గజెటా (2—7—66)లో పాశ్చాత్యదేశాల యువ ప్రపంచం మీద అక్కడి సినిమాల చెడు ప్రభావాన్ని ఖండించే ఒక వ్యాసం పడింది. దాని పక్కనే ఒక సోవియట్ పోలీసు అధికారి రష్యాలోని యువతీయువకుల వైఖరులని అనుశీలించి ఈ క్రింది విధంగా చెప్పినట్లు ప్రకటించారు.

"ఈ అబ్బాయి అమ్మాయి అందరూ మర్యాద, పురుష ప్రతిష్ఠ, కన్యలకి ఉండవలసిన లజ్జ, స్త్రీపురుషుల మధ్య సమానత్వం, అత్యంతరంగిక సంబంధాల విషయంలో ప్రయోజనాన్ని అర్పించే వైఖరి వీటిని గురించి కొంచెంకూడా సూక్ష్మంగా ఆలోచించ లేకుండా ఉన్నారు. అంతా అయోమయంగా ఉంటుంది. వక్రభావాలతో, మొరటుదనంతో, అలక్ష్యంతో, దుడుకుదనంతో, అవివేకవంతమయిన అనుకరణాలతో, బండతనంతో కప్పివెయ్యాలని చూస్తారు"

ఇదంతా ఎక్కడో విన్నట్టు లేదూ?

(ఫోరం వరల్డ్ ఫీచర్స్)●

## పిలుపు చెలువ

వలపు చెలికాడు నెలరాజువచ్చి చూచి
కొసరి గిలిగింత లిడి మేలుకొలుపుదాక
నిదుర లేవనె లేవవు నీ వదేమి
రాణివాసమొ! అది యేమి జాణతనమొ!

ఆ తొగరేనిగూర్చి విరహమ్మున కుత్తుకబంటి నీటిలో
నీ తనువెల్ల మున్గ తరుణీ! కనుమూసి తపమ్మొనర్తువో!
రాతిరియంతయున్ శశి సరాగము లాడగ కూర్మి చిప్పలన్
కెత్తలు చెప్పి ఆ బడలికన్ పగలంతయు నిద్రపోదువో!

కలువజవరాల! పతివియోగమ్మునందు
కన్ను తెరువవు— ఊర్మిళాకాంతవేమొ!
కానిచో అసూర్యంపశ్యవైన రాజ
వలభవో!! పూవుబోణి వెవ్వతెవో నీవు!!!

ఎన్నితారలనడుమ తా నున్నగాని
నీ వలపె కోరు—జాబిలి నిన్నె చేరు!
నేలపై నీవు—నింగిలో నీ ప్రియుండు—
అయిన [illegible] కంతన్ను లడ్డురావు!

—వక్కలంక లక్ష్మీపతిరావు.

# మళ్లీ రంగుమారిన బంగారం

## సేకరణ సి డి కె మూర్తి

ఇటీవల స్వర్ణనియంత్రణం నిబంధనల్ని సడలించి పద్నాలుగుకారట్ల బంగారాన్ని మళ్లీ యధాస్థాయికి మార్చి ఇరవై రెండుకారట్లు చేశారు ఈ కంట్రోలు ఎత్తివేసింతర్వాత (జన వాక్యంగా) వివిధ రంగాలకి చెందిన అయిదుగురి అభిప్రాయాలను సేకరించి ఈ క్రింద ఇస్తున్నాను

బేబి ఉమ

(మూడవ తరగతి, శారదా ప్రైమరీ స్కూల్, మాంబళం)

"బంగారం కంట్రోలు ప్రజల్ని చాలా వేధించింది ముఖ్యంగా దక్షిణదేశంలో ఈ కంట్రోలు వల్ల ఎంతో మంది నిరుద్యోగు లయ్యారు ఆకలితో బాధపడి చచ్చిపోయిన వాళ్లు కూడా వున్నారు ఇప్పుడెంతో హాయిగా వుంది అంతే కాకుండా పద్నాలుగు కేరట్ల బంగారం ధరించేందుకు ఆడవాళ్లకు నామోషి అయిపోయింది పెళ్లిళ్లలో సరేసరి మేలిమి బంగారం యిస్తేనే గాని పెళ్లికొడుకు పెళ్లిపీట ఎక్కనని మొరా యిస్తున్నాడు బంగారం ఒక్క అలంకార



శ్రీమతి రాజ్యలక్ష్మి



బేబి ఉమ



శ్రీ శివకొలుందు

వస్తువుల వినియోగానికే కాకుండా అవసర సమయాల్లో డబ్బు చేసుకోడానికి ఆపద్బాంధవిలా వుపయోగిస్తుంది నాకే కాకుండా నాతోటి విద్యార్థినులకు కూడా పద్నాలుగు కేరట్ల బంగారం మీద సద్భావం లేదు"

శ్రీమతి రాజ్యలక్ష్మి

(గృహిణి, పెరంబూరు)

"నాలాంటి గృహిణికి బంగారం కంట్రోలు ఎత్తివేయడం గురించిన ప్రకటన ఎంతో ఆనందాన్నిస్తుంది పందొమ్మిదొందల అరవై మూడులో నాకు పెళ్లయింది అప్పుడు బంగారం కంట్రోలు మెపంతో పద్నాలుగు కేరట్ల బంగారం నగలు నా మొహాన పారేశారు ఇప్పుడు మా వారు ఆ వస్తువులన్నింటినీ ఇరవై రెండు కేరట్ల బంగారంలో చేయిస్తానని మాటిచ్చారు కాని నాకిప్పుడు నగల కన్నా ఫాషన్‌గావుండే బట్టలు కొనుక్కోవాలని వుంటోంది"

శ్రీమతి తాయారమ్మ

(నౌకరు, పెరంబూరు)

"బంగారం పద్నాలుగు కేరెట్లయినా ఇరవై రెండు కేరెట్లయినా నాకేమంతా లేదు ఏది కొనుక్కుందామన్నా నా దగ్గిర డబ్బు లేదు నాదగ్గర పాత కాలంలోని ఒక్కటే ఒక్క గొలుసున్నది నాకు డబ్బవసర మైనప్పుడల్లా అదే వుపయోగ పడుతుంది ఏ మైనా సర్కారోళ్లిప్పుడు బంగారంతో తబ్బిబ్బులు లేకుండ సేశారు అదేశాన"

శ్రీ శివకొలుందు

(అసిస్టెంట్ స్టేషన్‌మాస్టర్, దక్షిణ రైల్వే)

"మాటి మాటికి బదిలీలయ్యే మా బోటి జీతగాళ్లు స్వర్ణ నియంత్రణం" ఎత్తివేయడంతో కాస్త ఊపిరి పీల్చుకో

"నాకు ఒకే ఒక్క కేరట్ గురించి తెలుసు మా నాన్నగారు మార్కెట్టుకెళ్లినప్పుడల్లా నా కోసం తెస్తుంటారు కేరట్ అంటే నాకు భలే యిష్టం పద్నాలుగు కేరట్లో ఇరవైనాలుగు కేరట్లో ఆ లెక్కలు నాకు తెలీవు మా నాన్న కిలోల్లెక్కన పట్టుకొస్తారనుకుంటా బంగారం గురించా మీరడిగేది? నాక్కావాల్సిన వస్తువులన్నీ మా నాన్న గారు చేయించారు నా క్లింకేమీ అక్కర్లేదు"

కుమారి వత్సల

(పి యు సి విద్యార్థిని, స్టెల్లామేరీస్ కాలేజి, మద్రాసు)

# రంగుమారిన బంగారం

దానికి అవకాశం చిక్కింది ఇరవై రెండు కేరట్ల బంగారం చేతిలోవుంటే డబ్బు కోసం అగచాట్లు పడేబాధ వుండదు మా తండ్రితాతల నాటి కాలంలో ఆడ వాళ్ల మెడల్లో నగలు దిగేసేవారు వాళ్లకు దూరదృష్టి చాలా వుంది. ఏ కష్టంలో ఏ అవసర మొస్తుందో బాగా తెలుసు అందుకే అలా చేసేవాళ్లు ఇప్పుడిప్పుడు రాజకీయ వాదుల చేతుల్లో బంగారం ఆటబొమ్మగా తయారయింది బంగారం కంట్రోలును ఎత్తివేసినందుకు అందరూ సంతోషిస్తున్నారు." ●

---

**అవీ–ఇవీ. .**

## డా. సర్వేపల్లి రాధాకృష్ణ డాక్యుమెంటరీ

డా సర్వేపల్లి రాధాకృష్ణగారి విద్యాభ్యాసం దగ్గరనుంచి నేటి రాష్ట్రపతి హోదావరకుగల నాలుగురీళ్ల రంగుల చిత్రంలో, వారి జీవిత విశేషాలు, విదేశీ పర్యటన—ఘనసత్కారాలు ఆదిగాగల వివరాల్తో ఆదర్శవంతమైన వారి జీవితానికి ప్రతిబింబితమైన యీ చిత్రం 'భారత చలన చిత్ర శాఖ' వారి ఉత్సాహమైన కృషికి నిదర్శనంగావుంది స్వర్గీయ మదనమోహన మాలవ్యా, గాంధి, నెహ్రూల సహచర్యంలో డా సర్వేపల్లి రాధాకష్ణగారి పాత్ర ప్రత్యేకతను కూడా యీ చిత్రం దృష్టీకరిస్తుంది ఇదికాక 'తారా పోరెవాలా అక్వేరియం' సహాయంతో తీసిన రంగుల చిత్రం 'పిష్‌ఫెంటసీ', కాశ్మీర్‌మీది మరో రంగులచిత్రంతో పాటు రెండు వార్తా చిత్రాలు కూడా మద్రాసు 'చిల్డ్రన్స్ థియేటర్'లో పత్రికా విలేఖరులకు చూపించారు —సికరాజు

## సిండికేట్ బ్యాంక్ కొత్త బ్రాంచి

ఇటీవలే అహమ్మదాబాద్‌లోని రిలీఫ్‌రోడ్, 4611, సడకేట్ బిల్డింగ్‌లో సిండికేట్ బాంక్ లిమిటెడ్‌వారు కొత్త బ్రాంచిని తెరిచారు ఈ బ్రాంచి ప్రారంభంతో గుజరాత్ రాష్ట్రంలో రెండు బ్రాంచీలు, మొత్తం 211 బ్రాంచీలయినవి ఈ సంవత్సరంలో సిండికేట్ బాంక్ లిమిటెడ్‌వారు ఏడు బ్రాంచీలను తెరిచారు. మరో ఏడు బ్రాంచీలు ఈ సంవత్సరాంతంలోగా తెరవబడతాయి.

## నలుగురమ్మాయిలూ - కళాప్రదర్శనమూ

మద్రాసు గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీకి చెందిన నలుగురమ్మాయిలు కన్నెమెరా హోటల్ కాంపౌండ్‌లో చిత్రకళా ప్రదర్శనాన్ని ఏర్పాటు చేశారు అధునాతన చిత్రకళకు హంగులు, శిల్పాలు కూర్చిన యీ నలుగు రమ్మాయిల పేర్లు వరుసగా సునందా గుప్త, అర్నవాజ్ డ్రైవర్, శామాపండిట్, పర్వీన్‌నదీర్షా ఈ నలుగురూ కలిసి కన్నెమెరా హొటల్ కాంపౌండులోని సరళా ఆర్ట్



'న్యూడ్'

సెంటర్'లో ఈ ప్రదర్శనాన్ని ఏర్పాటు చేశారు అర్థంలేకుండా గీసిన గీతల్నా అధునాతన చిత్రకళ అనుకుంటే ప్రదర్శనలోని అన్నిచిత్రాలూ సెహబాష్‌అనిపించుకుంటాయి అలాకాకుండా మామూలుమనిషికూడా చూసి భావోద్దీపనం చెందగల కొన్ని కళాఖండాలు కూడా యిందులో ఉన్నాయి సునందాగుప్త వర్ణ చిత్రణలో చక్కని నైపుణ్యాన్ని కనబరచింది అర్నవాజ్ డ్రైవర్ వర్ణచిత్రాలు ఆలోచనల్ని రేపుతాయి శామాపండిట్ శిల్పాలు చూడ ముచ్చటగా వున్నాయి పర్వీన్ నదీర్షా ప్రకృతి వర్ణనం కూడా ప్రశంసించతగ్గది.

—సికరాజు ●



# బాధ అనేది మాకు ఒక సమస్య...చూడండి మేము మీకు ఏవిధంగా సహాయపడతామో!




A G 3 66 TEL

**పరిశోధన** ఆస్ప్రో యొక్క పరిశోధనా సంస్థలోని ఒక పరిశోధనా దళానికి నేను ఉపదేశకుడను బాధను ఆపుజేయడానికి మంచి పద్ధతులను కని పెట్టుట మా పని ఈ విషయమును గురించి ఏకాగ్రతతో ప్రపంచమంతటా పరిశోధనలు జరుపుతున్న అగ్రగణ్యమైన పరిశోధనా సంస్థలలో మేము ఒకరము నొప్పిని నివారించుటకు నేడు శ్రేష్ఠమైన క్రొత్త మార్గము ఆస్ప్రో ఫార్ములా అని మేము తెలుసుకొన్నాము

ఇటీవల అమెరికా ప్రభుత్వమువారి అధ్వర్యమున జరిగిన పరిశోధనలు ఆస్ప్రో బాధను త్వరితముగను నిశ్చితముగను పోగొట్టుటకు చురుకైన పాళ్లు కల్గిన బాధానివారిణిగా తేటతెల్లము చేయుచున్నవి అందుచేతనే ప్రపంచమంతటా డాక్టర్లచేతను ఆసుపత్రులలోను ఇది వాడబడుతోంది

**బాధ అంటే ఏమిటి?** మెటాబొలిక్ ఉత్పత్తులు దేహము వాటిని తీసు కొని పోగలిగే కంటె హెచ్చు వేగములో స్నాయువులలో కూడుకొని చేరి పోవడంవల్ల మరుగుపడిన వాపు కలుగుతుంది దానితో నరములకు ఒత్తిడి కలిగి బాధ కలుగుతుంది

***ఆస్ప్రో ఎలా పనిచేస్తుంది** ఆస్ప్రో దేహములో వెంటనే యిమిడి వాపును నరముల మీద వత్తిడిని తగ్గించి నొప్పిని వెడలగొడుతుంది

***ఆస్ప్రో ను ఈ వ్యాధులకు వాడండి** నొప్పి తలనొప్పి ఒంటి నొప్పి పంటి నొప్పి కీళ్లనొప్పి జ్వరముతో కూడిన జలుబు ఫ్లూ కీళ్ల నొప్పులతో గూడిన జ్వరము

# 'ఆస్ప్రో' నొప్పిని వెడలగొడుతుంది!

# అర్ధాంగి



ఉన్నవ విజయలక్ష్మి

జరిగిన కథ

సుదర్శనానికి వైద్యం చేయడానికి అయిష్టాన్ని ప్రదర్శించిన డాక్టర్ హరీష్‌ను ఒప్పిస్తుంది మంజుల. శంకరం వేరొక యువతితో ప్రేమకలాపాలు జరుపుతూ ఆస్తికోసం మంజులను వివాహం చేసుకోడానికి వేసిన పథకాన్ని విన్న హరీష్, మంజులలు ఆశ్చర్యచకితులవుతారు. ప్రేమ వ్యక్తంచేసిన మంజులకు తానాశించిన సమాధానం హరీష్‌నుంచి రాకపోయేసరికి ఖిన్నురాలై వెళ్ళిపోతుంది. హరీష్‌కు తన కథనంతా వివరిస్తాడు సుదర్శనం. ఇష్టంలేని పెళ్ళి చేశారనే కోపంతో భార్య శాంతను నిర్లక్ష్యంచేసి జానకిని అస్థానంలో తీసుకొచ్చి పెడ్తాడు సుదర్శనం. పాపాయి నెత్తుకుంటుందన్న సుశీల కన్ను మూస్తుంది. అభిప్రాయభేదాలు వచ్చి మంజులకూడా వెళ్ళుతుంది. డాక్టరుగా హరీష్ తండ్రిని కలుసుకున్నాడు. తండ్రి రాకకోసం ఎదురు చూస్తూన్న శాంతకు అతన్ని చూసేసరికి ఆశలు అణగారిపోయినై.

## 10

"నాన్న వెళ్ళిన పని ఏమాత్రం సుముఖంగా లేదు. అది ఆయన మొహం చూస్తేనే తెలుస్తోంది. అత్తగారు మామగారు వాళ్ళన్నదానికి ఒక్కమెట్టు కూడ దిగి క్రిందకి రాలేదన్నమాట. ఎలాగో నాన్ననే బ్రతిమాలుకుని మరికాస్త డబ్బు వాళ్ళ మొహాన పడేయించాలి. అంతేకాని, ఈ స్థితిలో వారికిలా దూరంగా వుండటం నాకిక చేతకాదు. ఇవాళ వారు నన్ను అభిమానించకపోయినా ఆదరించకపోయినా, నేను ఎదురుగా వుంటే కొన్నాళ్ళకయినా తప్పకుండా మార్పువస్తుంది వారిలో. ఎన్నాళ్ళ దాకానో ఎందుకు రేపు పుట్టబోయే పాపాయిని చూసుకుని మురిసిపోతూ, ఆ సంతోషంలో, ఆ పాపకి తల్లిననే దృష్టితోనైనా నన్ను అభిమానిస్తారు. వారిలో ఎన్ని దుర్గుణాలయినా వుండుగాక మరో స్త్రీని కన్నెత్తి చూస్తారంటే నేను నమ్మను. కేవలం ఆస్థి కోసం, మమ్మల్ని భయపెట్టి అది రాబట్టుకోడం కోసం మా మామగారు వాళ్ళు పన్నిన పన్నాగం యిది. అంతకన్న మరేంలేదు."

ఆలోచనల మధ్య తండ్రి మాట వినిపించి, కిటికీ దగ్గరగా వెళ్ళి నిలబడింది శాంత.

"ఏం మనం విన్నది నిజమేనా?" ఎలాంటి సమాధానం వినాల్సి వస్తుందోనని బెదురుతూనే అడిగింది మాణిక్యాంబగారు భర్తకి కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు అందిస్తూ.

ఆయన ఆ నీళ్ళు అందుకోలేదు, కాళ్ళు కడుక్కోలేదు. కండువా తీసి కుర్చీ మీద గిరవాటేసి దిగాలు పడి కూర్చుండిపోయారు. ఆయన వాలకం చూసి అలాగే తలుపు నానుకుని బిగుసుకుపోయినట్లు నిలబడిపోయింది మాణిక్యాంబగారు.

కొంచెంసేపటి తరువాత చెప్పలేక చెప్పలేక చెప్పారు వెంకట్రావుగారు "ఆ నిజమే! దాన్ని నా కళ్ళతో నేను చూశాను. మనమీది కోపంతో నేనుండగానే ఇంటికి కూడ తీసుకొచ్చేశాడా దౌర్భాగ్యుడు" అని.

చెళ్ళున మొహం మీద కొట్టినట్లయి రెండుచేతులతోనూ మొహం కప్పుకుని అలాగే గోడ నానుకుని నిలబడిపోయింది శాంత.

"ఆ!.." బాధతో గొంతు పెగల్లేదు మాణిక్యాంబగారికి, "తల్లీతండ్రీ ఏమీ అనలేదా?" అంది చివరకు ఎలాగో.

వెంకట్రావుగారు ఏం మాట్లాడలేదు.

"పోనీ మీరయినా కాస్త నచ్చచెప్పకపోయారా?"

"ఏం చెప్పను. అక్కడి పరిస్థితి చూసేసరికి నాలో సహనం అంతా చచ్చిపోయింది. ఆవేశం ముంచుకు వచ్చింది. కట్టుకున్న భార్యని ఉసురు పెట్టి ఇలాంటి తప్పుడు పనులు చేయడం ధర్మంకాదు అని గట్టిగానే చెప్పాను. కొడుకు అంత నీచానికి దిగజారిపోతూంటే చూస్తూ వూరుకోడం పెద్దలయిన మీకు న్యాయంకాదు అని వాళ్ళని నాలుగు అనేశాను. వాటన్నింటికీ ఆ దౌర్భాగ్యుడు చెప్పిన సమాధానం ఒక్కటే. తలుచుకుంటేనే నా వళ్ళు జలదరిస్తోంది."

అంత భయంకరమైన విషయం ఏమై వుంటుందా అని భయపడుతూ చూసింది మాణిక్యాంబగారు. కుతూహలం అణుచుకోలేక కొద్దిగా ముందుకి వచ్చి కిటికీలోంచి చూడబోయింది శాంత.

వెంకట్రావుగారు నుదురు పట్టుకుని, బాధగా కళ్ళు మూసుకుని కూర్చున్నారు. ఆయన నోటిలోంచి వచ్చే మాట కోసం చెవులప్పగించి నిలబడిన భార్యతో, "అమ్మాయి ఎక్కడుంది" అన్నారు అలా కళ్ళు మూసుకునే.

"పిచ్చిపిల్ల మీరేదో మంచి వార్త తెస్తారని ఇందాకటి నించి తెగ ఎదురు చూసింది. మళ్ళీ ఏమనుకుందో గదిలోకి వెళ్ళిపోయింది. భగవంతుడు దాని నుదుట ఏం వ్రాశాడో. ఇంతకీ అతనేమన్నాడు" అంది గొంతులో బాధ సుళ్ళు తిరుగుతుండగా.

"ఏమన్నాడని చెప్పను. చెప్పటానికే నాకు నోరు రావటంలేదు. మళ్ళీ అమ్మాయితో అనకు. బాధ పడుతుంది. ఏ అఘాయిత్యం అయినా చేస్తుందేమోనని భయం

కూడ వేస్తోంది"

శాంత చటుక్కున కిటికీ పక్కకి వెళ్ళిపోయి వూపిరి బిగపట్టి నిలబడింది.

"ఏముంది అమ్మాయి కేరక్టరు మంచిది కాదుట. అందుకే వదిలేశాడుట. ఇంక అమ్మాయికి అతనికి ఏలాంటి సంబంధమూ లేదుట."

శాంత తల తిరిగిపోయింది. ఒక్క క్షణంలో వంట్లో వున్న రక్తం అంతా నీరయిపోయినట్లు, శక్తి అంతా హరించిపోయినట్లు, తనలో అసలు ప్రాణం అనేది వుందో లేదో కూడ తెలియనట్లు అయిపోయి, నిలబడలేక అలాగే చేత్తో గుండె పట్టుకుని తూలుతూ వెళ్ళి మంచం మీద వాలిపోయింది. ఆ తరువాత జరిగిన సంభాషణ వినగలిగే స్థితిలో లేదు ఆమె.

సాయంత్రం అయేసరికి కొద్దిగా తేరుకుని లేచి కూర్చుంది మెదడుకి కూడ ఆలోచించే శక్తి కొద్ది కొద్దిగా రాసాగింది. కొంచెం సేపు అటూ ఇటూ వూగులాడినా చివరికి ఒక నిర్ణయానికి రాగలిగింది.

తలుపులు తెరుచుకుని ఇవతలకి వస్తున్న కూతుర్ని చూడగానే మాణిక్యాంబగారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చటుక్కున లోపలికి వెళ్ళిపోయి కళ్ళు తుడిచేసుకుని కూతురు మొహం కడుక్కురాగానే కాఫీ గ్లాసు అందించింది తలవంచుకునే.

గ్లాసు అందుకుంటూ, "ఎందుకమ్మా అంత బాధ పడతావు" అంది నిర్లిప్తంగా

"నీకు తెలియదమ్మా.."

"నాకంతా తెలుసు. నేనూ విన్నాను."

"విన్నావా అమ్మా? అయితే..." ఆవిడ గబుక్కున ముందుకి వచ్చి కూతుర్ని కౌగలించుకుని బావురుమంది.

తల్లి ఏడుపు చూస్తూంటే శాంతకి కూడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కాని అవి ధారలు కట్టి క్రిందకి జారకుండా నిగ్రహించుకుంది.

"అతను అంత అన్యాయంగా మాట్లాడుతుంటే, తల్లీతండ్రీ ఏమీ అనలేదుటమ్మా. పాపం మీ ఆడబిడ్డ మాత్రం ఏదో అనబోయేసరికి ముగ్గురూ కళ్ళెర్రజేసి ఆపిల్లని కేక లేశారుట. ఆ అమ్మాయి చేసేదిలేక ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయిందిట."

"అవునమ్మా. అక్కడి మనుష్యుల తీరు నాకు తెలుసుగా. నువ్వేం చెప్పక్కర్లేదు."

"ఇప్పుడేం చెయ్యాలో తెలియటంలేదు. నీ కాపరం ఏలా సుఖ్ఖ పడుతుందో అంతా



పట్టడం లేదు. అసలు అతనికి అలాంటి అనుమానం ఎందుకు వచ్చిందో..నువ్వు వెళ్ళి బతిమాలుకుంటే."

"లాభంలేదమ్మా... వారి ప్రవర్తనతో విసిగిపోయి తిరగబడుతున్న మనస్సుని దారి లోకి తీసుకువస్తూ, అడుగడుక్కీ మేలు కొంటున్న ఆత్మాభిమానాన్ని అణగదొక్కుతూ, చాలామంది ఆడవాళ్ళల్లాగే గుట్టుగా సంసా రం ఈడ్చుకు రావాలని ఇప్పటిదాకా ఎంతో ప్రయత్నం చేశాను... నాన్నగారు చెప్పిన మాటలతో నా మనస్సు పూర్తిగా విరిగి పోయింది. "

"అలా అంటే ఎలా తల్లీ."

"నాకింకేమీ చెప్పకమ్మా. ఇక ఆ మను ష్యులు మారరు, నేను వాళ్ళ మధ్య వుండ లేను. నాకిక్కడే బాగుంది." అంటూ గదిలోకి వెళ్ళిపోయింది.

చేసేది లేక అప్పటికి వూరుకున్నారు తల్లీతండ్రీ

కాలం నత్త నడక నడుస్తోంది

ఎవరి ఖర్మానికి వాళ్ళని వదిలేసి హాయిగా బ్రతకనివ్వరుగా ఇరుగూ పొరుగూను అన్ని విషయాలు వాళ్ళకే కావాలి

"మీ అమ్మాయి ఇంకా అత్తగారింటికి వెళ్ళలేదేం? మరీ అలశ్యం కాకుండా ఓసారి పంపించి ఏడోనెల రాగానే పసుపుకుంకం ఇచ్చి తీసుకు రండి" అంటూ చొరవగా కల్పించుకుని ఉచితంగా సలహా లిస్తూండే వారు అన్నింటికి మాణిక్యాంబగారు 'ఆ, వూ' అంటూ సమాధానాలిచ్చేది

ఎలా తెలిసిందో ఎవరి ద్వారా తెలిసిందో కాని, సుదర్శనం అన్నమాటలన్నీ వాళ్ళ దాకా వచ్చాయి దానికి చిలవలూ పలవలూ కల్పించి, "ఇది విన్నావా? వాళ్ళ శాంత నడత మంచిదికాదుట అందుకే వదిలేసి అతను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడుట" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ ప్రచారం మొదలు పెట్టారు —

ఆ గొడవలన్నీ వింటూ వూళ్ళో తలె త్తుకు తిరగలేక, "ఏమిటమ్మా, నువ్విక్క డిలా వుండిపోడం ఏమీ బాగుండలేదు ఏదో ఆ కోపం వేడిలో అలా అనేశాడుగాని, నువ్వు వెడితేమామూలుగానే చూస్తాడని మా నమ్మ కం. మంచిరోజు చూసి నిన్నక్కడ దిగ విడిచి వస్తాం" అంది మాణిక్యాంబగారు

"నా ప్రాణంపోయినా ఆ యింట్లో నేను కాలు పెట్టను నాలో ఏ మాలిన్యమూ లేనప్పుడు వేనీ అపవాదులకి భయపడవలసిన

# అర్ధాంగి

పని లేదు." అంది శాంత.

మరికొన్ని రోజులు గడిచేసరికి వూళ్ళో వాళ్ళ గొడవ మరీ ఎక్కువైపోయింది.

"అతని అనుమానం నిజమేనేమో తనలో ఏతప్పూ లేకపోతే శాంత ధైర్యంగా అక్కడికి ఎందుకు వెళ్ళదు? అక్కడ మొహం చెల్లకనే ఇక్కడ వుండిపోయింది." అంటూ నలుగురూ, మాణిక్యాంబగారి ఎదు రుగానే చెవులు కొరుక్కోడం మొదలు పెట్టారు.

ఊళ్ళో పెద్దరైతుల దగ్గరి నుంచి పాలి కాపుల దాకా, పొలాల గట్లమీదా, రచ్చబండ మీదా శాంతని గురించే చర్చించుకుంటూండే వారు.

అవన్నీ వినలేక, విని భరించలేక విసిగి పోయిన వెంకటావుగారు భార్యని పిలిచి, "మెల్లిగా చెప్తే వినకపోతే, గట్టిగా మంద లించి అయినా అమ్మాయిని అత్తవారింటికి పంపే ఏర్పాటు చేయి". అన్నారు

శాంత ఎంతకీ మనస్సు మార్చుకోక పోవడంతో ఆవిడ చికాగ్గా, "బాగుందమ్మా నీ మొండి పట్టుదల నేనూ మీ నాన్నగారూ వచ్చి అన్ని విషయాలు సర్దుబాటు చేస్తాం అని చెప్పినా వినకపోతే ఎలా.. నీ ప్రవర్తనతో మా పరువు కూడ పోతోంది" అంది

శాంత ఏమీ మాట్లాడలేదు తండ్రి కూడ ఎన్నోవిధాల చెప్పాడు అయినా ఎలాంటి సమాధానం యివ్వలేదు కాని అప్పటికే ఒక నిశ్చయానికి వచ్చింది "నేని క్కడ వుంటేనే కదా వీళ్ళకి అప్రతిష్ఠ ఇల్లు విడిచి వెళ్ళిపోతే ఇంక వాళ్ళకీ నాకూ ఎలాంటి సంబంధం వుండదు. కాకపోతే నన్ను గురించి కొన్నిరోజులు యింకా చెడ్డగా చెప్పుకుంటారు తరువాత మరిచిపోతారు. అనుకుంది.

ఆ రాత్రి అందరూ గాఢనిద్రలో వుండగా ఇల్లు విడిచి స్టేషను వేపు బయలు దేరింది ఆ పల్లెటూరి రైలు స్టేషను నాలుగు మైళ్ళ దూరంలో వుంది. ఆ భయంకరమైన కాళరాత్రిలో ఆ నిశ్శబ్దాన్నీ భంగం చేస్తున్న కీచురాళ్ళ రొదలు, చీకట్లో దెయ్యాలు జుట్టు విరబోసు కున్నట్లు భ్రాంతి కలిగించే ఈతచెట్లు తుమ్మచెట్లు దారి పొడుగునా ఆమెను భయభ్రాంతురాల్నిచేస్తూంటే, జారిపోతున్న ధైర్యాన్ని కూడ దీసుకుంటూ, మొండిగా ఆ అర్ధరాత్రి వేళ నాలుగు మైళ్ళు పొలాల గట్ల వెంట, గతుకుల రోడ్డు మీద ఒంట రిగా నడక సాగించింది.

చివరికి ఎలాగైతేనేం స్టేషనులో మినుకు మినుకు మంటున్న లైట్ల కాంతి కళ్ళబడింది. ప్రాణం లేచి వచ్చినట్లయింది. కాస్త ధైర్యం చిక్కటంతో ఇంతసేపటి నుంచీ తెలియని అలసట హైరానా ఒక్కసారి చుట్టుముట్టాయి. దాహంతో గొంతు ఎండిపోయింది. నడచి నడచి కాళ్ళు మొద్దుబారిపోయి అడుగు తీసి అడుగు పెట్టడం కష్టం అయిపోయింది.

ఆ స్టేషను దగ్గరే ఓ చెరువు వుండాలి అన్న సంగతి అప్పుడే గుర్తు వచ్చింది. ఎలాగో మరో నాలుగడుగులు వేసి ఆ చెరువు గట్టు మీద కూలబడింది అలసట తీర్చుకోటానికి. త్వరగా దాహం తీర్చుకుని ఎలాగో స్టేషను జేరుకుంటే ఏదో ఓ రైలు అందుకోవచ్చు నన్నుకుంటూ మెల్లిగా లేచి మెట్లన్నీ దిగి నీళ్ళ దగ్గరికి వెళ్ళింది దోసిటితో నీళ్ళు తీసుకుందామని ముందుకి వంగింది. అంతే! ఛటుక్కున తన చెయ్యి ఎవరో బలంగా పట్టుకుని గుంజినట్లయి వులిక్కిపడి వెనక్కి తిరిగింది ఎవరో యాభై ఏళ్ళపై బడిన పెద్దమనిషి చీకట్లో ఆమెకు గుర్తు తెలియలేదు ఆమె అలాగే తెల్లబోయి చూస్తూంటే,

"ఏమిటమ్మా, నువ్వు చేస్తున్న పని." అన్నారు ఆయన సాధికారంగా.

"నేను...ఏంలేదు నేను." గొంతు పెగల లేదు శాంతకి. అయిపోయింది తన ప్లాను సాగదింక. ఈ పెద్దమనిషి ఎవరో తను గుర్తు పట్టలేకపోయినా, ఆయన తనని గుర్తించే వుంటాడు తనని బలవంతాన తీసుకెళ్ళి యింట్లో అప్పగిస్తాడు.

'ఆ నువ్వే ఏం చేయదలచుకున్నావు? నీ నోటితో చెప్పలేవులే. కాని నువ్వు చేయ దలచుకున్నదేమిటో నాకు తెలుసు దూరం నించే చెరువు గట్టు మీద ఒక మనిషి నిల బడి వుండడం కనిపించింది. కాస్త దగ్గరికి వచ్చాక ఆ మనిషి స్త్రీ అని గుర్తుపట్టాను. ఈ ఎటూకాని వేళ ఆవిడ కిక్కడేం పని అని ఆలోచిస్తే ఒక అనుమానం తట్టింది. వచ్చేసరికే నువ్వు మెల్లిగా మెట్లన్నీ దిగి నీళ్ళ దగ్గరికి వచ్చావు' అన్నారు ఆయన దొంగని పట్టిన పోలీసు అధికారిలా మొహం పెట్టి

"ఏమిటి మీ అనుమానం." అంది శాంత

# చిరుద్యోగపర్వం

నా చాంద్రాయణం అయ్యాక వీళ్ళమొహాల్ని, అక్కడున్న నిరాశని చూస్తుంటె రాత్రిళ్ళు నిద్దర పట్టటల్లేదు పడితే పాడు కలలు, పీడకలలు వొస్తున్నయ్ యిలా రాత్రిళ్ళు నిద్దర్లేకపోతే పగలుపన్చెయ్యలేక పోతున్నాను కావాలంటే ఫలానా వ్వాళ్ళ మున్సిపాల్టి వాళ్ళ నడగండి నేను సరిగా పన్చెయ్యటం లేదుగావల్ను, వాళ్ళు పగలు కూడా బజార్ల మీద లైట్లుంచుతున్నారు నాకు భయ మేస్తోంది. అందుకని వీళ్ళని నేను మన్లో కాని కొచ్చేవేళ్ళకి బజార్ల మీదికి రాకుండా చెయ్యండి అలాచేస్తే నాకు నిద్రపడ్తుంది వాళ్ళదివరకు నా తొలి దర్శనం చేసుకోనం దుకు ప్రతీకారం తీర్చుకుంటున్నట్టూ వుంటుంద'ని చెప్పి బ్రహ్మచేత 'సరే' నని పించుకున్నాక్కానీ నిద్రపోలేదతగాడు

ఆనాట్నుంచి వీళ్ళందర్నిసూర్యాస్తమయం య్యేసరికి కదలకుండా సూర్యుడెళ్ళిన గంటకో రెండు గంటలకో వదుల్తారు వాళ్ళాఫీసర్లు కాబట్టిదంతా పాప ఖర్మం శాపశేషం తప్పించటం నీతరవా? నాతరవా?' అన్నాడు పరమేశ్వరుడు మళ్ళీ పరమేశ్వ రుడే మొదలెట్టాడు 'అదీగాక ప్రపంచం పెరిగి పెద్దదయ్యింది పెద్ద య్యాక పిల్లల పెద్దవాళ్ళు పెద్దాళ్ళని మర్చిపోయి వాళ్ళ మాట విన్రు మనవేదో పెద్దాళ్ళలా వెడితే మన మాట విన్రు యింకా మనాజ్ఞ ఏమిటి వాళ్ళకి? కావాల్నొస్తే ఆ పక్క కొట్లో బెల్లం బుట్ట దగ్గరున్న చీవన్నాడు ఆ కొట్టువాడి చేతిని కుట్టింది వాడు 'అబ్బా' అంటున్నాడు నేన్నీకీ చిరుద్యోగి కథ చెవుతున్నాగందా యిప్పుడు దానికి కుట్టటానికి ఆజ్ఞ యివ్వలేదని నీకూ తెల్సుగా కానీ అది కుట్టింది శివుడాజ్ఞ లేకుండా చీవలు కుడ్తున్నయ్ యిహ మనుష్యులు వింటారా? అందుకని ఎందు కొచ్చిన గొడవ మన పెద్దరికం మనం వుంచుకుందాం. వాళ్ళ పేదరికం వాళ్ళను భవిస్తారు' అని పార్వతిని లొక్కెళ్ళి పోయాడు పరమేశ్వరుడు.

చిరుద్యోగి మెల్లిగా సైకిలెక్కు తున్నాడు పొద్దునొచ్చేప్పుడు అర్ధాంగి చెప్పీ చెప్పకుండా చెప్పిన దాంతో అర్ధం అర్థ మయ్యింది నాల్రోజుల కిందట బుజ్జిగాడి పాల్డబ్బా అయిపోయిందిట వారంరోజు ల్నించి చెప్పినా తను మర్చిపోతున్నాట్ట తను మర్చిపోయాడా? గుర్తుంది కానీ డబ్బు ల్లేవు డబ్బా కొంటానికి యివ్వాళ్ళో కణ్ణి బతిమాలి బదుల్తీసుకున్నాడు పాల్డబ్బా కొనుక్కుని కొట్టువాడు తిరిగిచ్చిన పావలా జాగర్తగా జేబులో వేసుకుని సైకిలెక్కాడు యల్డీసీగా చేర్టం మొదట్తప్పు పెళ్ళి చేసుకోటం రెండో తప్పు పిల్లల్ని కన్నం మూడో తప్పు' అనుకుని 'ఉస్సు' రన్నాడు చిరుద్యోగి కానీ మొదటిదీ మూడోది తనే చేసుకున్న తప్పుడు పన్లేనవిప్పుకొంటాడు కానీ రెండో తప్పు పెద్దాళ్ళుచేశారు పెద్దా ళ్ళకి పెద్దయిన బామ్మ చేసింది చిరుద్యోగి బామ్మ మీదెక్కళ్ళేని కోపం వచ్చింది ఉద్యోగంలో చేరిన మూడోరోజు నుంచే మొదలెట్టింది బామ్మ, 'ఒరేయ్, నువ్వో యింటివాడివైతే నా కళ్ళముందు 'అంటూ 'నామీద నీకెంత ప్రేమ బామ్మా సరే, అయితే మనింటి ముందున్న యిల్లు అమ్మకాని కొచ్చిందిట అది నాక్కొనిపెట్టు నువ్వు చక్కగా యీ వరండాలో నుంచునో కూర్చునో రెండు కళ్ళతో నన్ను పొద్దా కులూ చూడొచ్చు' అన్నాడక్కడికీ తను

'అది కాదురా నీకంతా వేళాకోళంగా వుంది పెద్దముండన్నాతోనా వేళాకోళం ఓ పిల్లన్జేసుకో ఎప్పుడూ వేళాకోళాలాడచ్చు నీ పెళ్ళి చూసినే 'హరీ' అంటా? నంది బామ్మ అప్పుడంత తొందరెట్టింది యిప్పటికూ్కడా హరికథలకెడ్తూ,పురాణాలు వింటూ 'గోవింద'లే కొడ్తోంది ఎలాగయితే నేం 'యింటివాణ్ణయ్యేంతవరకు యింటి వాణ్ణవ్వను .

'ఇల్లు—ఇల్లాలూ' అన్న సంగతి నీకూ తెలుసుగా' అంటూ ఉద్యోగంలో చేరిన నెల దాకా నెట్టుకొచ్చాడు పెళ్ళి సంగతి. కానీ రోజూ పురాణం కూడా మానుకుని పెళ్ళి రామాయణం మొదలెట్టేది 'ఏంరా, నికేం వంలా సర్కారుద్యోగం చేస్తున్నావ్ పించ నొస్తుంది పెళ్ళంటె మాట్టాడవే' అనేది.

'బామ్మా, నీకు పెళ్ళిళ్ళ సంగతి తెలీదు గానీ వూర్కో' అనే వాడు చిరుద్యోగి

'అవున్నాయినా, మాకేం తెల్సు, మీకు తెల్సుగాని. మేమేవన్నా పెళ్ళిళ్ళు చేసు కున్నావా? పిల్లల్ని కన్నావా? '' అంటూ తలా చేతులూ తిప్పేది

'అదికాదు బామ్మా యీ రోజుల్లో నాలుగొందలు జీతవొస్తేగాని పెళ్ళి చేసుకో కూడ్దు ఆరొందల జీతవప్పుడుగాని పిల్లల్ని కనగూడదు నీకా సంగత్తెలీదు . అందుకని ముప్పై ఏళ్ళొచ్చాగాని పెళ్ళి చేసుకో గూడదు' అనేవాడు.

'ఏవిటీ ముప్పైఏళ్ళా? యింకేం డెభ్భై ఏళ్ళకి చేసుకోనాయినా ముప్పయేళ్ళకి చేసుకుంటాట్ట తగుదునమ్మా అంటూ • ముప్పయ్యేళ్ళకెన్నేళ్ళ దాన్ని చేసు కుంటావురా? పాతికేళ్ళ కన్యామణినా? హవ్వ అదొచ్చిన రెణేళ్ళల్లోనే నామాదిరవు తుందిరా సన్యాసి నువ్వే సన్యాసవో పుచ్చు కోవచ్చు అందులో యీ రోజుల్లో ఆడ పిల్లలు హయ్యోరామ! వాళ్ళ కంటె యిన్నేళ్ళొచ్చినా నేనే నయం అదేం వీల్లేదు గానీ, యీ జేష్టమాసంలో నువ్వు చేసుకు తీరాల్సిందే, అంది

'సరే, తర్వాత చూద్దాం.. నే నిప్పు డాఫీసుకు పోవాలి' అంటూ లేచాడు చిరు ద్యోగి

ఒకరోజు చిరుద్యో గాఫీసు నుంచి వచ్చే వేళ్టికి బామ్మ వాకిట్లో నిలబడి ఎదురుచూ స్తోంది చిరుద్యోగి రాంగానే 'ఒరేయ్, యివ్వా ళేదో తేలాల్సిందే అదిగో, ఆ కాఫీ తాగు . యిందాక సుబ్బమ్మొచ్చింది దాని మనవరాల్ని చేసుకోమని పిల్ల లక్షణంగా వుంట్నంది. హైదరాబాదులో చదువుతోందిట కూడ. మా మాదిరేం చదువుకోంది కాదు నీ చదు వుకి తగిందే ఏం తగ్గదు నేనా సుబ్బ మ్మతో ఏదో మాట యీ వారంలో చెప్పె

# అర్ధాంగి

ఆ అబ్బాయిని ఈ ఉదయం నేను తెచ్చి పోవాలనీ, త్వరలో ముహూర్తం పెట్టించి వ్రాస్తే తల్లీతండ్రీ అంతా వచ్చి ఆ శుభ కార్యం జరిపించి, ఆ అబ్బాయిని నాదగ్గరే వదిలేయాలనీ అనుకున్నాం. అన్నీ బాగానే వున్నాయి. ఆ తరువాతి సంభాషణ కాస్త శృతి మించింది. అదే నా మనస్సుకి కష్టం కలిగించింది

ఆ అబ్బాయి తండ్రి వూళ్ళో నలుగురు పెద్దమనుష్యులని పిలిపించాడు అందరి ఎదురుగా నాకున్న ఆస్థి వివరాలు అడగడం మొదలు పెట్టాడు. ఇష్టం లేకపోయినా కొన్ని సంగతులు చెప్పాను. ఆస్థిలో చిల్లి కాని కూడ నేను ఇతరత్రా ఖర్చు పెట్ట కూడదనీ, అది అంతా పిల్లవాడి పేర ఇప్పుడే వ్రాసేయాలనీ, ఒకవేళ ఏమీ వ్రాయ కుండా నేను చచ్చిపోతే, తరువాత వాళ్ళు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుం దనీ ఏవేమిటో మాట్లాడారు అంతా కలిసి

నాకు చిరాకేసి, ఆస్తి అంతా అబ్బాయి కివ్వను సగమే వాడికిచ్చి మిగతాది ఏ ధర్మ కార్యాలకయినా వినియోగిస్తానని చెప్పాను వాళ్లేమో బేరాలు మొదలు పెట్టారు నేనూ తగినట్లు సమాధానాలు చెప్పాను ఆ సంభాషణ అలా చాలాసేపటి దాకా సాగింది చివరికి నేను మనస్సు మార్చుకుని ఇంటికి వెళ్లి వుత్తరం వ్రాస్తానని చెప్పాను నేను వ్రాయబోయేదేమిటో వాళ్ళు గ్రహించు కున్నట్లే వున్నారు

ఇక్కడనుంచి మా వూరికి తెల్లవారు జామున ఒక రైలు వుంది, దాంట్లో వెళ్లిపోతానని చెప్పాను వాళ్ళు ఏమీ మాట్లా డలేదు వచ్చినప్పటి లాగే బండీ అదీ, ఏర్పాటు చేస్తారేమోనని చూశాను. అలాంటి సూచనలేవీ కనిపించలేదు. ఎవరి మట్టుక్కి వాళ్ళు తలుపు వేసుకుని లోపల పడు కున్నారు వరండాలో నులకమంచం వాల్చు కుని నడుం వాల్చాను ఎంతకీ నిద్ర పట్ట లేదు. క్రింద నల్లులూ, పైన దోమలూ పీకేస్తూంటే ఓ గంట సేపు ఇటూ అటూ దొర్లి, ఇంక లాభం లేదనుకుని లేచి, చేతి సంచీ తీసుకుని తలుపు తట్టాను. ఇంటి యజమాని విసుక్కుంటూ తలుపుతీశాడు. వెళ్తున్నానన్నాను. అతనేమీ అనలేదు, నేను వచ్చేశాను ''

బాధగా నిట్టూర్చింది శాంత. ''పిల్లల కోసం ఈయన పడుతున్న తాపత్రయం గురించి వింటూంటే జాలేస్తోంది ఎవరి పిల్లలనైనా సరే తమ వారిని చేసుకోవాలని లేనివాళ్ళు ఆరాట పడుతూంటే, భగవం తుడు దయ తలచి ఇచ్చిన వాళ్ళు బాధ్య తల నుండి పారిపోవాలనుకుంటారు ఈయ నతో పోల్చి చూస్తే వారు . .''

ఆమె ఆలోచనలని ఆయన మధ్యలోనే చెదర గొట్టేస్తూ ''లేమ్మా ఇంతసేపూ నిన్ను నీళ్ళు కూడ తాగనివ్వకుండా కూర్చో పెట్టాను వెళ్లి తాగిరా బండికి టైమవు తోంది'' అన్నారు ఆదరంగా

శాంత వెళ్లి మొహం కడుక్కుని నీళ్ళు తాగి వచ్చింది ఆయన క్రింద పెట్టిన సంచీ తీసుకోబోతుంటే, ''మీ కెందుకు బాబయ్యగారు ఆ శ్రమ అది నాకివ్వండి'' అని అందుకుంది.

ఆ చీకటిలో, దాదాపు నిర్మానుష్యంగా వున్న ఆ పల్లెటూరి స్టేషనులో, ఆ ప్రాం తాలకి అపరిచితుడయిన శర్మగారిని గాని తల మీదుగా కొంగు కప్పుకుని తలవంచు కుని కూర్చున్న శాంతనిగాని ఎవరూ గుర్తు పట్టే అవకాశంలేదు.

శర్మగారి స్వంత యింటిలో అడుగు పెట్టిన శాంత కళ్ళు చెదిరిపోయాయి. ఎటు చూసినా లక్ష్మికళ తాండవిస్తున్న పరిసరాలు, అడుగడుగునా ఆడంబరంగా తమ వునికిని చాటుకుంటున్న ఐశ్వర్య చిహ్నాలు, పాడి, పంట, నౌకర్లు ఇంక ఈయనికి లోటేమిటి అనుకుంది. కాని కొద్ది సేపటిలోనే గృహలక్ష్మి లేని లోటు అడుగడుగునా కొట్టవచ్చినట్లు కనిపిస్తూ అంతటి ఆనందంతోనూ ఏదో అపశృతి వున్నట్లనిపించింది శర్మగారి పట్ల జాలీ సానుభూతి ద్విగుణీకృతం అయాయి.

మర్నాటికే శాంత సంగతి వూళ్ళో చాలా మందికి తెలిసిపోయింది ఊళ్లోనే వున్న దూరపు బంధువులు కొంతమంది వచ్చి, అభిమానంగా శాంతని పలకరించి, ''నువ్వు ఎవరు, ఏమిటి, ఎక్కడనించి వచ్చావు, శర్మగారు నీకేమవుతారు'' అంటూ ఆరా తియ్యడం మొదలుపెట్టారు

''ఏదో దూరపు బంధుత్వం వుందనీ, ఆమె తనకి కూతురు వరస అనీ, వంట్లో బాగుండకపోతే మందు ఇప్పించటానికి తీసుకు వచ్చాననీ'' అందరికీ శర్మగారే సమాధానం చెప్పారు అప్పటికి వాళ్ళంతా నోరు మూసు కుని వెళ్లిపోయినా, శర్మగారికి మాత్రం శాంత ఆ యింట్లో ఎక్కువకాలం అజ్ఞా తంగా బ్రతకలేదనిపించింది. తమ సంగతి వదిలేసి ఎదుటి వారిని గురించే ఎప్పుడూ మాట్లాడుతూండే ఆ బంధువులని చూస్తే ఒక విధమైన ఏహ్యభావం కలగ నారంభిం చింది. పైగా శాంత కంటే తమకే ఆయన మీద ఎక్కువ అధికారం వుందని వాళ్ళు అనుకోటం— సాధ్యమైనంత త్వరలో, బలవంతంగానైనా సరే, ఓ పిల్లవాడిని, ఆయన పెంచుకునేలా చేయాలనే వాళ్ళ తాపత్రయం అందుకు వాళ్ళలో వాళ్ళు పడుతున్న పోటీలు, ఆయన ఓ నిశ్చయానికి వచ్చేలా చేశాయి. పదిరోజులు తిరగకుండానే ఆయనకి గల స్థిరాస్తి అంతా రెండో మనిషికి తెలియకుండా రొక్క రూపంలోకి మార్చేశారు. ఇన్నాళ్ళ నించి తనని నమ్ము కున్న నౌకర్లకి వాళ్ళకి తగినట్లు ముట్ట జెప్పి, ఓ రాత్రికి రాత్రి శాంతని తీసుకుని



# అర్ధాంగి

ఆ వూరు విడిచి వచ్చేశారు తాము ఎక్కడికి వెళ్ళేదీ ఎవరికీ చెప్పలేదు, చివరికి శాంతకి కూడ

శాంతతోపాటు హైదరాబాదు స్టేషన్ లో దిగిన శర్మగారు,మొదట ఒకహోటల్లో గదులు తీసుకుని మకాం పెట్టారు నెల తిరగకుండానే రాజప్రాసాదం లాంటి భవనం కొని అందులోకి వెళ్ళిపోయారు శాంతకిదేమీ అర్థం కాలేదు తనని ఏ శరణాలయం లోనైనా చేర్పించటానికి ఇక్కడికి తీసుకొచ్చారేమో అనుకుంది మొదట కాని అటువంటి ప్రయత్నాలేమీ కనుపించక పోవటంతో ఓ రోజు తనే అడిగింది "బాబయ్యగారు మీరు ఇంతవరకు చేసిన మేలు నేను ఈ జన్మలో మరిచిపోను ఇంక నన్నేదయినా ఆశ్రమంలో చేర్పించారంటే అక్కడేదైనా వృత్తి విద్య నేర్చుకుని నా బ్రతుకు నేను బ్రతుకుతాను"

"పిచ్చిదానా, నిన్ను ఎక్కడో చేర్పించే ఉద్దేశ్యమే వుంటే, ఆస్థి కూడ అమ్ముకుని నేనా వూరు విడిచేసి వస్తానా— ఎందుకలా తెల్లబోతావు నువ్వు నా దగ్గరే వుందువుగాని నువ్వే నాకు భగవంతుడు అనుగ్రహించిన కూతురివి" అన్నారు ఆదరంగా ఆమె తల నిమురుతూ

శాంత రెండుకళ్ళూ నీళ్ళతో నిండిపోయాయి "పాపిష్టిదాన్ని, నా కోసం మీరు ఎంత శ్రమ తీసుకున్నారు? మీ ఈ అభిమానానికి నేను అర్హురాలిని కాదేమోనని పిస్తోంది అయినా మీ మనసు నొప్పించటం నావల్ల కాదు నేనూ మీతోనే వుంటాను కాని మీరు మొదట్లో అనుకున్నట్లు ఎవరినైనా పెంచుకుంటే"

మధ్యలోనే ఆమెని వారిస్తూ, "వద్దమ్మా వద్దు ఆ రంగాపురం మనుష్యులతో మాట్లాడిననాడే ఆ వుద్దేశ్యం నాలో రూపు మాసిపోయింది ఇంక నాకెవరితోను సంబంధం లేదు, ఉన్నదంతా అనాధలకి, అభాగ్యులకి పంచిపెట్టేద్దామని నిశ్చయించుకునే, నేనా యింట్లోంచి బయటికి వచ్చాను కాని, చిత్రంగా భగవంతుడు నిన్ను నాదార్లో పడేసి నా మనస్సు మార్చుకునేలా చేశాడు నీ కథ విన్న క్షణంలోనే నిన్ను దత్తపుత్రికగా స్వీకరించాను ఆత్మీయతని పంచిపెట్టటానికి నువ్వు చాలు నేను వాళ్ళతో చెప్పినట్లుగానే సగం ఆస్తి నీ కిస్తాను మిగతా దాంతో ఒక అనాధ శరణాలయం స్థాపించాలనుకుంటున్నాను అదుగో, ఆ కనిపించే మేడ అమ్మకానికుందిట అది శరణాలయం కోసం తీసుకోవాలనుకుంటున్నాను" అన్నారు.

శాంత హృదయం కృతజ్ఞతాభావంతో నిండిపోయింది "ఈ ఒక్క జన్మలోనే కాదు ఎన్ని జన్మలెత్తినా నేను మీ ఋణం తీర్చుకోలేను రెక్కలు తెగిన పక్షిలా కొట్టుకుంటున్న నన్ను ఆదరించి ఆశ్రయం చూపించారు అందుకే నాకెంతో సంతోషంగా వుంది డబ్బు విషయంలో మాత్రం మీ నిర్ణయాన్ని నేను ఆమోదించలేను. మీ దాయాదులున్నారు, బంధువు లున్నారు, నా విషయంగా అనవసరంగా మీరు చిక్కుల్లో పడటం నేను సహించలేను"

"నీ కలాంటి భయం ఏమీ అక్కర్లేదు.. నా ఆస్థి నా యిష్టం వచ్చినట్లు చేసుకుంటాను అందులో నా కూతురికి ఇచ్చుకోటానికి ఎవరి ప్రమేయం అవసరంలేదు. అయినా అంత జోక్యం కలిగించుకునే దాయాదులు, దగ్గరి బంధువులు నా కెవరూ లేరు. ఎవరో దూరపు బంధువులు బోలెడంతమంది వున్నారు కాని వాళ్ళకిప్పుడు నే నెక్కడున్నానో తెలియదు వాళ్ళందరికీ నేను ఇచ్చినది చాలా తక్కువే అని కొద్దిరోజులు గునిసి తరువాత నన్ను గురించే పూర్తిగా మరిచిపోతారు నేనెక్కడున్నానో వెతికి తెలుసుకునే ఓపిక వాళ్ళెవరికీ వుండదు.. మరో సంగతి నీకు చెప్పలేదు వాళ్ళంతా గుర్తు పట్టటానికి వీలు లేకుండా నేను పేరు కూడ మార్చుకున్నాను ఇంక మనం నిశ్చింతగా గతాన్ని విస్మరించి కొత్త జీవితం ప్రారంభించవచ్చు నీ కభ్యంతరం లేకపోతే, నిన్ను కూడ నా కిష్టమైన మరోపేర్న పిలుచుకోవాలని వుంది"

"నా కభ్యంతరం ఏమిటి బాబుగారు, మీకెలా యిష్టమైతే అలాగే పిలవండి ఇది ఏనాటి ఋణానుబంధమో, నా కోసం మీరు అయిన వాళ్ళందరి దగ్గర నిస్సారం కొనితెచ్చుకున్నారు" అంది చెక్కిళ్ళ మీదికి కారుతున్న కన్నీరు ఒత్తుకుంటూ

(సశేషం)



# వారసుడు

శేషప్రభ

పెరుమాళ్ళు నామం దిద్దేడు అద్దం ముందు కోరికల పందిరి పాకిన పట్టె నామాలు ఆ దైవం పేరిట దిద్దడం పెరుమాళ్ళుకు దిన చర్య చిల్లి గవ్వ లేనివాడల్లా దీక్ష పట్టి మరీ పెద్ద వాడయ్యేడు. ఆ వున్న డాబా, వ్యాపారం, అతడి దీక్షకు తార్కాణం నెత్తి పలచబడినా అతను అంత బాధపడలేదు. కాని తెల్ల వెంట్రుకలు, మిణుకు, మిణుకుమని కంచు కాగడాలై తలపై ఆక్రమించడం కొంచెం దిగులుగా వుంది అలనాడు వ్యాపారం ప్రారంభించిన కొత్త నుంచి, ఆనవాయితీగా తెచ్చుకున్న నామాలు ఆ ముఖానికి మరి కొంచెం పెద్ద తనం ఆపాదించుతున్నాయేమోనని యిబ్బంది పీకుతోంది మనసులో. అయినా నామాలు వదలడం మరీ కష్టమైన బాధ "తప్పు కదూ!" అని చేతులు దేవుని ముందు రెండు చెంపలేసేయి.

అవతల గదిలో మూలుగు రంగమ్మదని తెలుసు కోడాని కేమంత సేపు పట్టలేదు. "మళ్ళీ ఏ మొచ్చిందో ఈవిడకు" అని విసుక్కుంది మనసు. అలాగే హారతి వెలిగించి ఏడుకొండల స్వామిని తలుచుకుని గంట వాయించాడు పెరుమాళ్ళు.

రంగమ్మ అతని భార్య భర్తను మహారాజుగానే చేసి, తానొక చరణదాసిగా కాలక్షేపం చేసింది పెరుమాళ్ళు కూడా అనుకూలంగా పాత్రగానే కాలంగడిపేడు. రంగమ్మ భర్త వ్యాపారేతర విషయాలు, కొన్ని తన సంసారానికి హానికరమైనవిగా ఉన్న, కేవలం భర్త స్వంత విషయాలుగా వదలి వూరుకుంది అయినా, యింత మంచి రంగమ్మకు ఒక్క కోరికమాత్రం పీక్కు తింటోంది మాతృత్వం లేని బ్రతుకే వెలితి దానికోసం పూజాపునస్కారాలటుంచి, దాన ధర్మాలటుంచి, తీర్థయాత్రలటుంచి అనుభవజ్ఞులైన డాక్టర్ల సలహా కూడా తీసుకుంది కాలంగడిచింది కాని వెలితి తీరలేదు 'భగవంతుని దయలేదు' అని పెదవి విరచేది పిల్లలమాట అటుంచి చేసిన స్నానాలు యాత్రా భోజనాలతో వచ్చిన ఉబ్బసం వ్యాధితో కృష్ణా, రామా, అనుకోడంలో రోజులు దొర్లుతున్నాయి

దొడ్లో రత్నం ఏదో చక్కబెడుతున్నట్టుంది కాలుకాలిన పిల్లిలా పూజకానిచ్చిన పెరుమాళ్ళు అటూ, యిటూ తిరుగుతున్నాడు రత్నంతెచ్చిన ఆరుయిడ్లెన్నూ, గిన్నెడు నెయ్యి, కారప్పొడితో భోంచేసి గ్లాసెడు కాఫీపుచ్చుకొని వ్యాపార కార్యక్రమానికి దిగే అలవాటుని ఈరోజు కూడా నిర్విఘ్నంగా పూర్తిచేసి రంగమ్మ గదిలోకి నడిచేడు ఆయన అలికిడి విని రంగమ్మ ఆయాసంతో ఓకేక వేసింది

"రత్నం ఎక్కడ ఛస్తున్నావ్?" పరుగెత్తుకువచ్చి బెదురుతో నిలబడింది రత్నం.

"అయ్యగారికి కాఫీ, టిఫిను చూసావా" అంది రంగమ్మ.

"ఆ! అయింది" అని పెరుమాళ్ళు "ఎలాగుంది?" అని ముక్తసరిగా అడిగాడు.

'ఫరవాలేదు. బాగానేవుంది' అంటూ

లేవబోయింది రంగమ్మ. పెరుమాళ్ళు తెళ్ళిపోయేడు. అలా అడగడమే పదివేలుగా భావించిన రంగమ్మ దుప్పటి పైకి లాగుకుని మళ్ళీ రత్నంను పిలిచింది.

'కుడితిలో బడ్డ ఎలికలా ఏంపని? కాస్త కాఫీ తాగి తరువాత చూడు అపని' అంటూంటుండగనే రత్నం మందు గాజు గ్లాసులో పోసి రంగమ్మ చేత తాగించింది రంగమ్మ కళ్ళల్లో కృతజ్ఞత వెలిగింది ఆరోజు పగలు రంగమ్మకు కొంచెం నెమ్మదిగా ఉండడంతో ఎంగిలి పడందే రత్నం ఊరుకోలేదు.

రత్నం పగడపుబొమ్మ ఇంటిచాకిరీతో బండబారిన వైఖరి కనిపిస్తుందేకాని అందంలో ఆరోగ్యమైన సౌందర్యం ఉంది నిండా పదహారేళ్ళు లేని, రత్నం అరవిరిసిన ముగ్ధ కుసుమంలా కనిపిస్తుంది రంగమ్మ ఆ అందాన్ని మనస్సులో ముద్దుగొని, సంతోష పడుతోంది. అంతరం పొలిమేర అవతలే ఉంచినా, మనసు, రత్నం మీద మెత్తగా మోపుతుంది అందుకనే కసిరినా అప్యాయత చిందుతుంది ఆమె మాటల్లో రంగమ్మ వాలు కుర్చీలో విశ్రాంతిగా పడుకుంది. పెరుమాళ్ళు జోళ్ళ చప్పుడు చేసుకుంటూ వచ్చాడు రత్నం అయ్య చేతిలో పళ్ళు అందుకుని లోపలికివెళ్ళింది మూడో మనిషితో మాట్లాడుతున్నట్లు 'కులాసాగా ఉన్నట్టుందే' అన్నాడు పెరుమాళ్ళు

"యిప్పుడు బాగానే వుంది. రాత్రి కెలా వుంటుందో" నిట్టూరుస్తూ అంది రంగమ్మ.

ఉన్నట్టుండి "విశాలాక్షి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది" అన్నాడు. రంగమ్మకు వివరో పోల్చుకోడానికి చాలాసేపు పట్టింది. ఆమె పెరుమాళ్ళుకు చాలా దూరపు వరసన చెల్లెలు.

'ఎట్లా ఉన్నారు? అందరూ క్షేమ మేనటా?'

'ఆవిడ రాయలేదు వాడు.. చిదంబరం వ్రాసేడు'

'ఏమని? అప్పుడే అంతవాడయ్యాడా? ఎప్పుడో చిన్నప్పుడు చూసేనువాణ్ని.. ..' రంగమ్మ అప్యాయంగా ప్రశ్నలు వెయ్యడం ప్రారంభించింది. విశాలాక్షి భర్త పోయిన తర్వాత తనబిడ్డడితో ఎలాగడుపుతోందో అనే ఆలోచనల్లో లీనమై పోయింది రంగమ్మ. కాసేపటికి తేరుకుని "ఎలా వున్నారండీ? వాళ్ళూ..." అప్యాయతగా అడిగింది.

"ఏముంది. నన్ను చూసి కన్నుకుట్టింది" విసురుగా అన్నాడు పెరుమాళ్ళు. రంగమ్మకు అర్థం కాక మాట్లాడలేదు.

'వాడు యిక్కడ చదువు వెలగబెడతాడుట. అందుకు రెండు సంవత్సరాలు మన యింట్లో వుంటాడుట' రంగమ్మ యీ సారి మాట్లాడలేదు కాని ఆలోచనలు దూరం పరుగెత్తాయి చిదంబరంని కళ్ళెదుట తెచ్చుకుని నిలబెట్టుకున్నట్లు ఊహించుకుంది మాతృత్వం కోసం తహ తహ లాడుతున్న ఆమనసు. తన దగ్గిర కూచుని చదువుకుంటోన్నట్టు ఊహించుకుంది. మాతృత్వాన్ని ఆపాదించుకుని, వర్షాగమనానికి పులకరించిన భువిలా మనసు తేలిక పడింది. ఆరాత్రి నిద్ర పట్టలేదు. వర్షం వెలిసిన శరత్కాల వెన్నెల రాత్రిలా హాయిగా వుంది. ఆయాసం దగ్గు ఆ రాత్రి దగ్గరికి రాలేదు ఫలించిన ద్రాక్ష గుత్తుల వంటి ఆలోచనలతో ఆరాత్రికి కాపలా కాసింది

ఉదయం లేవే పెరుమాళ్ళు పూజా సామగ్రి, పట్టె వర్ధనాల పెట్టె సర్దింది. తరువాత ఫలహారం పెరుమాళ్ళు ముందుంచుతూ, వణుకు తున్న కంఠంతో అంది.

'మిమ్మల్ని ఒక్కటి కోరుతున్నాను.'

పెరుమాళ్ళు కనుబొమ్మలు ముడివడ్డాయి. రంగమ్మ ముఖంలోకి చూసేడు శ్రావణ మేఘాల్లా అలుముకున్న కంటి నీళ్ళు ఏదో ఉత్కంఠను తెలియజేస్తున్నాయి. ఆవిడ నోట్లోంచి మాటలు కష్టంగా వచ్చాయి.

'చిదంబరాన్ని వచ్చి యిక్కడ చదువమనండి.'

ఆమాటకు మనస్సులోనే విభిన్నమైన ఆలోచనలతో పీక్కున్నాడు పెరుమాళ్ళు. కొంతసేపు మాట్లాడలేదు మాట చెప్పడానికి తెరచిన నోరు రంగమ్మ అక్కడ లేక పోవడం చూపి, మూతపడింది

* * *

చిదంబరం ముఖంలో విశాలాక్షి ముద్ర ఉంది. సన్నగా పొగగా ఎదిగిన శరీరం, నమ్రత చురుకుతనం చూపుతున్న కళ్ళు చూడగానే ఆకర్షించే ముఖం రంగమ్మను ఆకట్టుకున్నాయి.

కుర్రవాడు బి. ఏ దాకా రావడానికి ఎంత కష్టపడ్డాడో కదా అనుకుంది. చిదంబరానికి కావలసిన ప్రతివిషయం తరచి తరచి అడిగి తెలుసుకుంది ఎంతో ఓపికతో. అందుకే రంగమ్మలో అమ్మ కనబడుతుంది చిదంబరానికి. ఏవస్తువు ఎప్పుడు కావాలో జ్ఞప్తికి వుండదు అతనికి మరచి పోయి మరో జన్మలో బ్రతుకుతున్నట్లు అదో రకమైన ఆదమరుపు అంతేకాదు. అప్యాయంగా చూచేవాళ్ళదగ్గర కూడా అభిమాన పడుతూనే ఉంటుందతని మనస్సు. ఒక్కొరోజు, రంగమ్మ స్థిమితం లేక పడుంటే అన్నం ధ్యాస లేకుండానే అవతలికి వెళ్తాడు. ఆదమరిస్తే పెరుగుపోసుకోకుండానే లేచి చెయ్యి కడుగుతుంటాడు. ఎందుకో రత్నానికి చిదంబరం వచ్చిన దగ్గర్నుంచి గట్టిగా మాట్లాడా లన్నా, విచ్చల విడిగా తిరగాలన్నా ఒళ్ళంతా బిడియపడుతోంది చిదంబరంతో మాట్లాడాలనివుంటుంది కాని మాట్లాడదు అతడు ఆదమరచి ఏదైనా తినక పోతే మనసు బాధపడుతుంది.

కృష్ణాష్టమంటే పెరుమాళ్ళుకు ప్రత్యేకమైన పండగ ప్రతిసారి లాగే ఆరోజు నలుగురు స్నేహితులను పిలిచి పులిహోర బొబ్బట్లతో చక్కగా విందు చేసేడు ఆరోజు కొట్టు భారమంత చిదంబరం మీద పడింది సాయంత్రం వరకు కొట్టుమీదనున్న చిదంబరం అలసటతో అలాగే కాలేజీకి నాటకం రిహార్సల్‌కి వెళ్లేడు. పెరుమాళ్ళు భాగవతం దగ్గర పెట్టుకుని దీర్ఘాలు తీస్తూ చదివేడు రంగమ్మ మగతగా పడుకుంది. రత్నం చిదంబరం కోసం ఎదురుచూస్తోంది అనుకోకుండానే కళ్ళు మూతలు పడ్డాయి మెలుకువ వచ్చి చూసేసరికి మూడంకె వేసి పడుకున్న చిదంబరం కనిపించేడు లేపాలనుకుని నాలుక కరచుకుంది యిక నిద్రపట్టలేదు మనసు, చిదంబరంమీద పరి పరి విధాల చిందర వందరై పోయింది రాత్రి పడుకున్న చిదంబరంలో తెల్లారి ప్రొద్దెక్కినా కదలికలేదు శరీరం కంపిస్తోంది. అణగారుతున్న ప్రాణలోంచి, సన్నటి మూలుగు వినిపిస్తోంది రత్నం భయంతో కంపించింది రంగమ్మ గదిలోకి వెళ్ళి గద్గద కంఠంతో ఏదో

స్పింది. జ్వరంతో కాలిపోతున్న శరీరాన్ని ముట్టుకున్న రంగమ్మ వైద్యుడి కోసం త్వరబెట్టింది. ఆనాలుగు రోజులు అంటీముట్టకుండా ఏదో పరిచర్య అతనికి చేస్తున్నానని మనసు ఆనందపడ్డా రత్నం ఎందుకో గట్టిగా ఏడవాలనే చాలాసార్లు అనుకుంది తేరుకున్న తర్వాత కూడా చిదంబరం చుట్టూ తిరిగి వేళకి మందూ మాకూ చూసేది. రంగమ్మవద్ద కంటే ఈకొద్ది రోజుల్లో రత్నం వద్దే చనువు చూరగొన్నాడు చిదంబరం. అదే పదివేలుగా రత్నం గుండెల్లో ఆనందం గంతులేసేది

*                *                *

'రత్నం అన్నం వడ్డించు. తొందరగా కాలేజీకి వెళ్ళాలి!' అన్నాడు చిదంబరం అన్నం తింటూ రత్నంతో ఏదో చెబుదా మనుకున్నాడు బొటనవ్రేలు నేలకురాస్తూ దూరంగావుంది రత్నం "మీకాలేజీలోనాటక మంట ఈరోజు మేము కూడా చూడ వచ్చునా?" అంది రత్నం 'ఆ, ఆ! తప్ప కుండా చూడచ్చు అత్తయ్యను తీసుకురా. సాయంత్రం నేనిక యింటికి రాలేను ఆలస్యమవుతుంది' అని చెయ్యి కడుక్కుని తొందరగా లేచి వెళ్ళిపోయాడు

ఆరోజు రాత్రి నాటకానికి వెళ్ళేరు రత్నం, రంగమ్మ నాటకం చాలా బాగుంది. ఒక యువకుడు ఉద్యోగం కోసం ప్రతి ఆఫీసుకు తిరిగి తిరిగి అలసి పోతాడు. ఒక ఆఫీసరు యింటికి వెళ్ళి, తన కాలేజీలో వున్న కొద్ది పరిచయంతో ఆయన కుమార్తెతో కబుర్లు కలుపు తాడు. తానొక పెద్ద ఉద్యోగం చేస్తున్నట్టు ఆ ఆఫీసర్ తో పనిమీద మాట్లాడ డానికి వచ్చినట్టు అబద్ధమాడతాడు. బయట ఎందుకూ మారని మనిషి ఆ యింట్లో నౌకర్లు, చాకర్లు ఆఫీసర్‌గారి అమ్మాయి దగ్గర విపరీతమైన గౌరవం పొందుతాడు. ఆఫీసరుగారి అమ్మాయికి ఆకొద్దిపేపట్లోనే అతని మీద ప్రేమ కలుగుతుంది. అలా కొద్దిరోజులుగడిపి తిరా ఆఫీసర్‌గారు ఎదరపడే సరికి వ్యవ హారం తారుమారవుతుంది. ఆఫీసరుగారు ఉద్యోగం వివరాలు అవీ అడిగి అవి అన్నీ అబద్ధాలని నిరూపించి, బయటికి తరుము తాడు. కాని అప్పటికే ఆయన కూతురు ప్రేమించిందని తెలుసుకుని, కూతురు ప్రేమ కాదననేలేక యిద్దరికి పెళ్ళిచేసి ఒకఉద్యోగం యిప్పిస్తాడు న్యాయంగా సాధించలేక పోయినా ఉద్యోగం, ఒక అబద్ధంతో, అనుబంధంతో సంపాదిస్తాడు నాయకుడు నాటకంలో. ఆవేషం వేసింది చిదంబరం అని కనిపెట్టేసరికి రత్నంలో ఎక్కడ లేని ఉత్సాహం సంతోషంకలిగి పరవశం చెందింది మాటలు చేతకాని, మందకొడిగాఉండే చిదంబరమేనా యితడు అని ఆశ్చర్య పడింది యింటికి నడిచిన గుర్తేలేదు అతని అభినయం నెమరు వేసు కోవడంలో ఏదో విచిత్రమైన అనుభూతిలో నిండిపోయింది ఆలోచనల ఊయల నిండు చందమామలో తూగినట్లుగా సంతోషంతో నిండిపోయింది

ఆలస్యంగా లేచిన చిదంబరం ముఖం కడుక్కుని రంగమ్మ గదిలోకి వెళ్ళేడు అప్పటికే అక్కడ టిఫిన్ సేవిస్తున్న పెరుమాళ్ళు 'నాటకాల నాయకుడని చూస్తేనే తెలుస్తోంది' అన్నాడు వ్యంగ్యంగా, కడిగినా సరిగా పోని మెడమీద నున్న ఎర్రరంగు చూస్తూ. రత్నం కాఫీ తెచ్చి చిదంబరానికిస్తూ కళ్ళల్లో ప్రేమ నింపి అతనికేసి చూస్తూ అందించింది నాటకంలో అనుభూతి వాళ్ళిద్దరిమధ్యా కదిలింది అలా రత్నం అతని కేసి చూడ్డం పెరుమాళ్ళుకి అసూయ కలిగించింది. కాలు కాలిన పిల్లిలా కాఫీ గ్లాసుతో గదంతా తిరిగాడు

"మామయ్యా, పరీక్షఫీజుకి ప్రస్తుతం అరవై రూపాయలు కావాలన్నాడు' చిదంబరం. ఎప్పుడూ అత్తద్వారా డబ్బుతీసుకొనే అలవాటులో ఉన్నా, ఎలాగా ఎదురుగా ఉన్నాడు గదాఅని.

పెరుమాళ్ళు ఒక్కసారి కోపంతో 'నా కోసం వెలగబెడుతున్నావ్ చదువు! తింటూన్నది చాలక—' మాట పూర్తి కాకుండానే చిదంబరం గదిలోంచి బయటపడ్డాడు చిదంబరంలో అహం మండి పోయింది. బయలుదేరి వస్తున్నానని తల్లికో ఉత్తరం రాశాడు వెంటనే. భోజనాల గదిలోకి వెళ్ళి 'నేను వెళ్ళిపోతానని అత్తతో చెప్పు' అన్నాడు రత్నంతో. 'ఈ మాత్రానికేనా? అయ్యగారి తరహాయే అంత. అమ్మగారు యిస్తానన్నారు డబ్బు బాధ పడకండి.' రత్నం మాటలు అభిమానంగానే ఉన్నాయి గాని మనసు యింక అక్కడ ఉండేందుకు యిష్టపడలేదు. వీధిలోకి వెళ్ళిపోయాడు చిదంబరం. తిరిగి వచ్చే సరికి రాత్రి సుమారు పది గంటలు దాటింది. తిన్నగా గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు అప్పటికే రంగమ్మ, పెరుమాళ్ళు నిద్రపోతున్నారు. రత్నం భోజనం తీసుకు గదిలోకి వచ్చింది పెట్టె, బెడ్డు సర్దిన చిదంబరం 'రత్నం! యింటి దగ్గర అమ్మకు జబ్బుగావుందని టెలిగ్రాం వచ్చింది నేను వెళ్తున్నాను అనుక్షణం నిద్రకోసం పోరాడుతూ, ఎలాగో నిద్ర పట్టించుకున్న అత్తను లేపడం యిష్టం లేదు నేను వెళ్ళిపోయానని, ఆమె ప్రేమకు మరొక జన్మలో పరిహారం చెల్లించుకుంటానని చెప్పు నీకు నేను ఏమీ యివ్వలేను.' అని రుద్ధ కంఠంతో సామాన్లతో బయటకు వెళ్ళిపోయాడు. రత్నం కళ్ళలోంచి మూగగా కన్నీరు పొరలు పొరలుగా వస్తోంది సుదూరమైన ఆకాశంలో, మేఘాల మధ్య గాలితో తేలి ఆడుతున్న తెగిన గాలి పటంలా మనసు తేలిపోతోంది అలాగే పిచ్చిగా కూలబడింది.

వెళ్ళిన వారానికి ఉత్తరం వచ్చింది తల్లి పోయిందని చిదంబరం నుంచి. రంగమ్మ విచారించింది. భర్తతో చిదంబరాన్ని రమ్మని రాయండి అంది 'ఎవరి కర్మ కెవరు కర్తలు' అని చప్పరించాడు పెరుమాళ్ళు.

*                *                *

'రత్నం, నీకు జడవేస్తాను రావే' అని రత్నాన్ని దగ్గిర కూర్చోండ బెట్టుకుని జడ వెయ్యడం ప్రారంభించింది రంగమ్మ. రంగమ్మలో మమతలూరి బాధ పెడుతున్నాయి ఆ మమతల్ని వర్షించేందుకు ఉన్న ఒకేఒక మనిషి రత్నం. తల్లి తండ్రుల్లేని రత్నాన్ని యింట్లో పని కోసం తెచ్చుకున్నా, పిల్లల్లేని రంగమ్మకు ఒక్కొక్కసారి ఆమె దేవుడిచ్చిన బిడ్డగా కనిపిస్తుంటుంది. జడ వేస్తుండగానే, రత్నానికి పెళ్ళి చేయాలనే తలంపు వచ్చింది రంగమ్మకు.

ఆ రోజే భర్తను కదిపింది. "ఆ! పిల్లులకీ, కుక్కలకీ, పెళ్ళిళ్ళు చేయడానికి మనమేం పాపం చేసేం" అన్నాడు పెరుమాళ్ళు. కలుక్కుమంది రంగమ్మ

మనిష్ని:— ఎలాగైతేనేం వాదించి ఈ దారికి తీసుకు వచ్చింది రంగమ్మ అతన్ని.

ఆ రోజు ఆదివారం. పెరుమాళ్ళు సోదర వర్తక బృందంతో పేకాటలో కాలక్షేపం చేసి ఒంటి గంటకు లేచాడు. భోజనం చేసి పక్కమీద వాలేసరికి, ఎదురు వసారాలో ఒంటరిగా కూర్చొని రత్నం అన్యమనస్కంగా ఏదో ఆలోచిస్తోంది మాట్లాడేందుకు ఏమీ విషయం లేక వాలు కుర్చీలో పడుకుని రత్నం కేసి చూస్తోంది రంగమ్మ

మూడు గంటలకి కాఫీ కోసం కుంపటి వెలిగిస్తోన్న రత్నానికి వీధి తలుపు చప్పుడు వినిపించింది లేచి వెళ్ళి తలుపు తీసింది ఇద్దరు వ్యక్తులు బయట నిలబడి పెరుమాళ్ళుని గురించి అడిగేరు 'నిద్ర పోతున్నారు'. అంది రత్నం. అయితే లేచే వరకు కూర్చుంటాం అని లోపలికి జొరబడ్డారిద్దరూ ఇంతట్లో పెరుమాళ్ళు లేచి బయటికి రావడంతో రత్నం తన పనిలోకి వెళ్ళిపోయింది. వెళ్తోన్న రత్నంతో మూడు కాఫీ పట్టుకురా అని ఆజ్ఞాపించేడు పెరుమాళ్ళు.

'ఆఁ ఏమిటి వీరేశం, విశేషం? నాగరాజును కూడా తీసుకొచ్చేవే? కూచో, కూచో,' అంటూ తనూ కూలబడ్డాడు. 'ఆఁ నాగరాజూ ఎక్కడ పనిచేస్తున్నావోయ్?' అని అడిగేడు.

'శరభేశ్వరరావు గారి ఇనుప దుకాణంలో నండి'... అన్నాడు నాగరాజు.

'ఏం పనేమిటి అక్కడ...' అని అర్ధోక్తిగా అడిగాడు పెరుమాళ్ళు.

'ఇంట్లోనూ, కొట్లోనూ కూడా అన్ని పన్లూ తనే చూస్తుంటాడు' అని సర్ది చెప్పేడు వీరేశం.

'అయితే రాజా! నీవు శరభేశ్వరరావును వదిలి నాదగ్గర కొచ్చేస్తావా...' అడిగేడు పెరుమాళ్ళు. నిలబడ్డ నాగరాజు వీరేశం ముఖంలోకి చూసి నేలకేసి చూస్తూ నిలబడ్డాడు.

'తప్పకుండా వస్తాడు. వాడు అడవి చాకిరీ చేయించి, కడిగి ఇచ్చే జీతం కంటే నువ్వో పది ఎలాగా ఇస్తావు కదా!' ఎదర కాళ్ళకి బంధం వేసి జవాబు చెప్పేడు వీరేశం.

రత్నం మూడు గ్లాసుల్లో కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది. పెరుమాళ్ళు వీరేశం తీసుకున్నారు కానియ్! నువ్వూ తీసుకో, ఇంకా నాదగ్గర చేరలేదు కదా — అంటూ చకిలినవ్వు విసిరాడు పెరుమాళ్ళు. నాగరాజు మొగమాటంగా అలాగే నిలబడ్డంతో రత్నం గ్లాసు అతనికి అందిచ్చి లోపలికి వచ్చేసింది రత్నం. 'రేపట్నించి చెయ్యవలసిన పని ఈ రోజే మొదలయినట్టుందే' అంటూ అదోలా చిరునవ్వు విసిరేడు పెరుమాళ్ళు. ఆ మాట ఎవర్ని అన్నాడో ఎవరికి అర్థం కాలేదు కాసేపు మంతనాలాడి వచ్చిన వాళ్ళిద్దరూ వెళ్ళిపోయేరు

రాత్రి ఎనిమిది దాటింది. రంగమ్మ చోడిజావతాగి నెమ్మదిగా వసారాలో అటూ ఇటూ భారంగా అడుగులేస్తూ అప్పుడప్పుడు నెమ్మదిగా దగ్గుతూంది. పళ్ళు కుట్టుకుంటూ వచ్చి పెరుమాళ్ళు ఇవాళ కొంచెం బాగున్నట్టుందే' అన్నాడు అలా ఆ కబురూ ఈ కబురూ చెప్పి 'రత్నం పెళ్ళి వచ్చే వారం చేసేద్దామేం' అన్నాడు

'అంతా దాని అదృష్టం. ఇంతకు పెళ్ళికొడుకుని చూడద్దూ' అంది రంగమ్మ.

'పెళ్ళికొడుకులేకుండా పెళ్ళా? చెట్టుకో జిట్టకో కట్టేద్దామనేమిటి? అని నవ్వుతూ తను పెళ్ళికొడుకును ఎలా వెతికి పట్టుకున్నదీ, అతను ఎలాంటి మనిషో వివరించి చెప్పాడు' రంగమ్మ భర్త మీద కృతజ్ఞత కళ్ళతోనే వరించింది. 'పోనీలెండి ఏదో తల్లిలేని పిల్ల అని చేరదీసినందుకు..... నే బ్రతికుండగానే పెళ్ళి మీద రెండక్షింతలు వేసేసే ఋణం తీరిపోతుంది. ఆనందంతో నిట్టూర్చింది.

రత్నం పెళ్ళి జరుగుతోంది. అని తలుస్తూనే సంతోషపడుతోంది. పెళ్ళికి చేసే ఆకొద్ది ఏర్పాట్లు తనే స్వయంగా చూస్తోంది. పెళ్ళి విషయం రత్నం చెవిని వేసింది. రత్నం గాలిలోకి తేలిపోతున్నట్టు అయింది.

'నాకెందుకమ్మా పెళ్ళి?' ఆశ్చర్యంగా అడిగింది 'మా అమ్మకి నేను బాకీ ఉన్నానే వెర్రిపిల్లా! . అందుకు ఈ మాత్రంచెయ్యకుండా నాప్రాణంపోతే నాఆత్మ నీకోసం ఇక్కడే ఉండిపోతుందని భయం' తన ప్రేమంతా వ్యక్తం చేస్తూ వళ్ళు నిమురుతూ అంది.

రత్నానికి అవ్యక్తమైన ఆలవేదన, వ్యర్థ జీవితంలో కొత్త బాధ తరుముతున్నట్టు ఒళ్ళు తపించింది. పొంగుతన్న దుఃఖం ఎర్రబడ్డ కళ్ళల్లో కన్నీటిచారలు రేగేయి 'ఎందుకే అలాబాధ పడతావు నాదగ్గరే ఉండచ్చు నన్ను ఒదిలి వెళ్ళక్కర లేదులే! అంటూ దగ్గరగా తీసుకుంది రంగమ్మ ఎండలోంచి వచ్చిన మనిషి ఇంట్లోకి వచ్చి చల్లని చోట కూర్చున్నట్లుగా అనుకుంది రత్నం

'మొన్న ఇక్కడకు రాలేదు నాగరాజు, అతనే పెళ్ళికొడుకు' అంటూ వివరంగా చెప్పింది రంగమ్మ . రత్నం నెమ్మదిగా దొడ్లోకి వెళ్ళిపోయింది మొన్నవచ్చిన గళ్ళతువ్వాలు తలకి చుట్టుకున్న నాగరాజా తను పెళ్ళి చేసుకోవాలి', అని తర్కించుకుంది రత్నం. ఆమె మనసులో భూమీ ఆకాశం, నక్షత్ర నాగలోకం లాంటి అంత



రాలు కనిపించినవి. చిదంబరం, నాగరాజు చెరొక ప్రక్కనుంచి చూస్తున్నట్టు ఎవరో తనని నాగరాజు ప్రక్కకి తోసి వట్టు యిద్దరూ కలిసి దిగజారి; పాతాళానికి జారిపోతున్నట్టు భయంకరంగా ఆలోచించటం మొదలు పెట్టింది.

చిదంబరం గురించి ఆలోచించడానికి తనెవరు? తనగురించే తనకు తెలీదు. రంగమ్మ ఆదరణలో తాను పెంచుకున్న ఆశలు కుండపేలినట్టు విడచి వెళ్ళింది. తనజీవితమే కిందపడి శత సహస్ర శలాకలైన మట్టి కుండ అనిపించుకుంది. అయినా యింతవరకూ తనపై రంగమ్మ చూపిన ప్రేమాదరణలకు తన కృతజ్ఞత చూపి, ఆమె జీవితపర్యంతం ఆసరాగా ఆమెదగ్గర ఉండడం తన ధర్మంగా భావించింది. వెంటనే గిరున వెనక్కి తిరిగి రంగమ్మ దగ్గరకెళ్లి ఉద్వేగంతో 'నీ యిష్ట ప్రకారం కానియ్యమ్మా' అంది రంగమ్మ కౌగలించుకుంది

ఊరి గుళ్లో పెళ్ళయింది పెరుమాళ్ళు దొడ్లో తాటాకు యిల్లు వేయించి కొత్త దంపతులని గృహప్రవేశం చేయించేడు నాగరాజు పూర్తిగా పెరుమాళ్ళు బానిస అతనింట్లో ఉన్నంత సేపు యింటిపని తర్వాత కొట్లోపని వ్యవహారాలన్నీ అతనే చక్కబెట్టడం ఒక నియమ బద్ధమైన కాలమంటూ లేక యిరవై నాలుగ్గంటల్లో ఎప్పుడూ ఏదో పని కలుగ జేస్తుంటాడు పెరుమాళ్ళు. రత్నం పని మామూలే పైగా రెండో వంట కూడా చెయ్యాలి. జీవితం కూడ చర్విత చర్వణంగా యాంత్రికంగా తయారైంది

ఆకాశంలో మబ్బులు వల్లగా కరుడు గట్టినట్లున్నాయి. చల్లటి గాలి తూగి తూగి వీస్తోంది. రత్నానికి ఆవాతావరణం చాలా శాంతి కలిగించింది. డాబామీద ఎండ వేసిన చీరలు, జాకెట్లు తెచ్చుకుందుకు పైకి వచ్చింది. చిన్నతుంపర ప్రారంభించింది. వన్నటి కూనిరాగంతో బట్టలన్నీ తీసి క్రిందికి దిగి వచ్చింది. రంగమ్మ గదిలోంచి దీర్ఘంగా ఒగర్పు వినబడుతుంది గదిలోకి వెళ్ళింది. రంగమ్మ శ్వాసకోసం బాధపడుతూ లేవదియ్యమని చెయ్యి అందించింది దిండ్లు సరిచేసి కూర్చో పెట్టింది కళ్ళు పెద్దవిచేసి శ్వాసకోసం బాధపడుతూ యింకా చూస్తూనేవుంది. బీరువాలో మందు తీసి నోట్లో పోసింది. రంగమ్మ బాధ అమావాసల చీకటిలా గడుస్తోంది.

పెరుమాళ్ళు సిగరెట్టు కాలుస్తూ నాగరాజు తెచ్చియిచ్చిన నోట్లకట్ట లెక్కపెడుతున్నాడు. నాగరాజు కొంతదూరంలో నించున్నాడు. పూర్తిఅయింతర్వాత పది రూపాయలు నాగరాజు వేపు విసిరేడు పెరుమాళ్ళు. నాగరాజు కృతజ్ఞతగా అందుకు జేబులో ఉంచుకున్నాడు.

'చూడు! వ్యవహారమంతా బాగాచక్కబెట్టుకోవాలి. నీకు ఎంత డబ్బు కావాల్సినా నన్ను అడుగు మొగమాటపడకు అన్నాడు పెరుమాళ్ళు మీదయ....'' అన్నాడు నాగరాజు

'ఈరోజు నుండి దుకాణంవైపు రానక్కరలేదు. అక్కడే వుండి నీపనిచూసుకో!'' పెరుమాళ్ళు లేచేడు.

నాగరాజు దొడ్లో గుడిసెలోకి వెళ్ళేడు. రత్నం కనిపించలేదు. పనిలో ఉంటుందని మంచం బయటికి లాగి, కూర్చుని బీడి అంటించేడు

“ఎంత ధర్మాత్ముడు కాకపోతే యింత సహాయం చేస్తాడు. అవునన్న పిల్లనిచ్చి పెళ్ళి చేసేడు. యిల్లిచ్చేడు చేతికి నాలుగు పైసలూ అందుతున్నాయి యింతకంటే బ్రతుకింకేం కావాలి '' హాయిగా ఆకాశం వైపు చూస్తూ బీడిదమ్ము గట్టిగా లాగేడు. కొద్దిగా పలకమారి వెళ్ళింది. ఆకలిగా వుంది. రత్నం యింకా రాలేదు. నెమ్మదిగా రంగమ్మ గదివైపు వెళ్ళేడు. అక్కడ రంగమ్మ గుండెలకి కాపడం పెడుతున్న రత్నాన్ని చూసేడు. తిరిగి వచ్చి మంచిమీద కూలబడ్డాడు

రత్నం వచ్చింది. భోజనం మవునంగా పెట్టి మాట్లాడకుండా కూర్చుంది. నాగరాజువచ్చి కంచం దగ్గర కూచుని రత్నంకేసి చూశాడు. బొమ్మలా కూచున్న ఆమెని చూసి,

“ఏం! అలారాయిలా కూచున్నావ్? అన్నాడు.

'ఏమీలేదు. అమ్మగారికి బాగా లేదు.'

'అదా! అయితే నేను తినేస్తాలే, అమ్మగార్ని చూడువెళ్ళి'........ అమాయకంగా ఏదో చెప్తూ కూచున్నాడు.

రత్నం కదలకుండా కూచుంది. మనస్సులో ఏదోతీవ్రమైన ఆలోచన రేగు తోన్నట్టు కనిపిస్తోంది. నాగరాజుకు ఏం మాట్లాడాలో తెలియక తికమక పడుతున్నాడు.

దీపంవైపు చూస్తూ 'వెనక వీధి వైపు కొత్తపాకలో నువ్వు రోజూ చేస్తున్నదేమిటి?' అడిగింది. ఏలా సమాధానం చెప్పాలో తోచలేదు నాగరాజుకు కాసేపు వూరుకుని 'ఏమీలేదు. బ్రతుకుతెరువు అయ్యగారి చలవ. నాలుగు డబ్బులు దొరుకుతున్నాయి' అంటూ నెమ్మదిగా అన్నాడు.

నాగరాజుకు సారాబట్టీలో అనుభవం ఉందన్న సంగతి పెరుమాళ్ళుకు తెలుసు. వెనకవైపు వీధికి దగ్గరగా కొత్త పాక వేయించి దాంట్లో సారా వ్యాపారానికి నాగారాజు చేత ప్రారంభోత్సవం చేయించేడు. నాలుగైదు రోజుల్నుంచి నాగారాజుకి యిదే హడావిడి నిన్నటినించి సారా తయారవుతూంది. మరో వేపు నించి అది చెలామణి అయిపోతూంది. రోజూ ఏభై, అరవై పైగా లాభం కిడుతోంది. నాగరాజుకి కూడ ఐదు, పదీ రోజుకి మిగులుతోంది నాగరాజులో ఉత్సాహం కనిపెట్టే రత్నం యీ రోజు అడిగింది యీ రెండ్రోజుల సంపాదన వివరాలు చెప్పి, 'నీకు నెలాఖరుకి గొలుసు చేయిస్తా' అన్నాడు. రత్నం తనలో తను నవ్వుకుని 'ఈ వ్యాపారం ఎంత తొందరగా మానుకుంటే అంత మంచిది' అని రంగమ్మకోసం కదిలి వెళ్ళిపోయింది. నాగరాజు అమాయకంగానే ఏమిటీమాట అనుకుని వెనక వీధి వైపు కదిలిపోయాడు.

రోజు రోజుకు రంగమ్మ నీరసించి పోయింది. ఎన్ని మందులైనా కుదురు లేకుండా పోయింది. రత్నం యింక యిరవై నాలుగ్గంటలూ ఆమె దగ్గరే గడుపుతోంది. నాగరాజు తన ధ్యానంలో తను పడ్డాడు. నమ్మిన బంటు యజమానికి లాభంమీద లాభం సంపాదించి పెడుతున్నాడు.

* * *

మునిమాపు చీకటి. రత్నం రంగమ్మకి చెంచాతో మందు తాగిస్తూంది. దొడ్లో ఏదో అలికిడి వినిపించింది, రత్నం వసారా

లోంచి చూసింది పోలీసులు మధ్య నాగరాజు ఏదో అడుగుతున్నారు యింతలో పెరుమాళ్లు అక్కడికి వెళ్లేడు ఏమీ తెలియని వాడిలా నమస్కారం పెట్టి నిల బడ్డాడు

'ఈ వ్యాపారం ఎవరిదండి? వీడెవడు?' అడిగాడు యినస్పెక్టరు

'వీడు మా యింట్లో నౌఖరు వీడి పెళ్లాం చిన్నప్పట్నుంచి మా యింట్లో పెరిగింది అందుకని యిక్కడే ఒక పాక వేసుకోనిచ్చేం ఏం ఏంచేసేడు' అని అడిగేడు అమాయకంగా వారేదో చెప్పేరు

'హారినీ! యిది ఎప్పట్నుంచిరా, డబ్బు లేకపోతే నన్నడగాలి గాని యిదేం పనిరా కాగా నా యింట్లోనే పెట్టేవ్!' ఈ మాట లెవరివో అర్థం కాలేదు రత్నం వసారాలోనే కుప్పగా కూలిపోయింది వాళ్లు నాగరాజును తీసుకెళ్లిపోయేరు నెమ్మదిగా రంగమ్మ వచ్చి 'అదేమిటే అలా పడి పోయావ్!' అంది లేచి రంగమ్మను గది లోకి తీసికెళ్లి వివరం ఏడుస్తూ చెప్పింది

పెరుమాళ్లు రత్నాన్ని పిల్చి 'ఇదేం పెద్ద విషయం కాదు బెంగపెట్టుకోకు నాగరాజు రెండు రోజుల్లో వచ్చేస్తాడు మనదింకా కొత్త కదా గాడిలో పడలేదు' అంటూ వికటంగా నవ్వాడు

రంగమ్మ పెరుమాళ్లని గదిలోకి పిల్చి ఏడుస్తూ రోషంగా 'అది నాకు తల్లి బిడ్డకు చేసినట్టు చాకిరీచేస్తూంది దాని ఋణం తీర్చలేనిది ఏమిటీపని అబ్బాయిని వెంటనే తీసుకురండి' అంది పెరుమాళ్లు వెళ్లిపోయాడు.

రత్నానికి ఈ పరిసరాలపై అసహ్యం కలిగింది యిన్నాళ్లూ రంగమ్మకోసం ఆమె సేవకోసం ఏదో అనుభూతిలో అక్కడ ఉండి పోయింది ఏది ఏమైనా యింక ఆ పరిధిలో నూతిలో కప్పలా ఉండే కంటే, బయటికి వెళ్లి తన భర్తని తను తెచ్చుకోవాలనే జిజ్ఞాస కలిగింది నాగరాజు రాందే, అతనికి చెప్పందే దీనికి పరిష్కారం లేదు అతని రాకకై ఎదురు చూస్తోంది.

నాలుగు రోజులకి పెరిగిన గడ్డం, పీక్కుపోయిన కళ్లతో నాగరాజు దొంగలా వచ్చి యింట్లో ఒక మూల కూచున్నాడు రత్నం ఆశ్చర్యంగా చూచింది నాగరాజు మాట్లాడలేదు చీకటి తెరల్లా రత్నం ముఖంలో కన్నీటి చారలు కన్పడుతున్నాయి. నాగరాజు సిగ్గుతో ఏడ్చేడు 'యిదివరకైతే తను ఒంటరి మనిషి యిప్పుడు యిద్దరు అప్పుడు ఎక్కడికి వెళ్లి వచ్చినా ఎవరికి సమాధానం చెప్పనక్కర లేదు యిప్పుడు ' ఈ విధంగా ఆలోచించి ఉద్రేకంగా 'రత్నం! యిక్కణ్ణుంచి వెళ్లిపోదాం కష్టంచేసి—సంపాదిద్దాం జరిగింది మర్చిపో మరింకేమీ అనక ' అన్నాడు ఆ తర్వాత యిద్దరూ చల్లగా హాయిగా ఉన్నాయి చంద్రుడు బయట పడ్డాడు అంతా వెన్నెలతో మెరుస్తోంది

ప్రొద్దున్నే నెమ్మదిగా రంగమ్మగదిలో అడుగు పెట్టింది రత్నం రంగమ్మ ప్రశాంతంగా పడుకుని ఉంది అలికిడికి నెమ్మదిగా కళ్లు తెరిచి 'కాస్త మందిస్తావా?' అంది నెమ్మదిగా మందిస్తూ 'అమ్మా, నేను వెళ్లిపోతాను' అంది 'ఎక్కడికే మతికాని పోయిందా ' అంటూనే దగ్గుతూ వాలి పోయింది రంగమ్మ పెరుమాళ్లు పూజ పూర్తిచేసి యివతలికి వచ్చి 'ఏం జరిగింది' అని, రంగమ్మని చూసి డాక్టరుకోసం వీధిలో ఎవర్నోపంపి లోపలికొచ్చాడు నచ్చేటప్పటికి యింకేమీ వద్దన్నట్టుగా చేతులూపి రత్నం బుగ్గలు నిమిరి శాశ్వతంగా నిద్రపోయింది యిన్నేళ్లుగా నిద్రకోసం పోరాడిన రంగమ్మ.

చేసిన పాపాల ఫలితమా అన్నట్టు పది రోజులకి రంగమ్మకోసం వెళ్లి పోయాడు పెరుమాళ్లు వ్యవహారమంతా చిదంబరంపైన పడింది యిద్దరికి యథావిధిగా కర్మ కాండలు జరిపించి చిదంబరం, ఆస్తి వ్యవహారాలు అన్నీ తేల్చి ఒక పక్కకి తీసుకువచ్చాడు రత్నం నాగరాజులకి యివి అప్పచెప్పాలనే కోరిక కూడ అతనికి వచ్చింది కాని అప్పుడే తెలిసింది పెరమాళ్లుకి యింకా మిగిలిన చరిత్ర

రత్నాన్ని పిలిచి 'నువ్వూ, నాగరాజూ ఎలాగూ వెళ్లిపోతున్నారు కదమ్మా. నా సామాను కూడా సర్దుకోనియ్యండి నేనూ వచ్చేస్తున్నాను' అన్నాడు

'యింకా మీరెక్కడికి వెళ్తారు అర్ధోక్తిలో ఆగి పోయింది రత్నం

'రైలుకు వీలయినప్పుడు నువ్వూ నాగరాజూ శ్రీరంగపురం రండి' అంటూ తన చిరునామా యిచ్చి లోపల గదిలోకి చూపించాడు

ఆగదిలో నలభై ఏళ్ల స్త్రీ ఎనిమిదేళ్ల పిల్లవాడు ఉన్నారు పెరుమాళ్లు ఫొటోకేసి చూపించి 'నాన్నకి దణ్ణం పెట్టు బాబు, అంటోందా స్త్రీ మిగిలిన ముగ్గురూ ఒకే రైలుకివెళ్లి పోయారు. ●



'వర్షం పడడానికి నువ్వుచేసే ప్రార్థన ఇహనైనా ఆపు చేస్తావా?'

చిన్న సీరియల్ ప్రారంభం

# నిరుద్యోగ పర్వం

## మొదటి కథ — చిరుద్యోగి చరిత్ర




కోళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ

చీకట్లు దట్టంగా కమ్ముకుంటున్నయ్ గుంటూరు బ్రాడీపేట ప్రాంతాల్లో వున్న ఒకాఫీసు మారుమూల గదిలో నెత్తిమీద చుట్టూతా చుట్టుకున్న ఫైళ్ళన్నిటినీ తోసుకుంటూ తలెత్తి ఎదురుగా వున్న గడియారం వంక చూశాడు చిరుద్యోగి టైం ఏడున్నరయ్యింది చిరుద్యోగి ఆఫీసులో చిన్న వుద్యోగం చేస్తున్నాడు. చిరుద్యోగులకీ, ఆఫీసర్లకీ సంబంధం ఎక్కువ పై ఆఫీసర్లకీ క్లబ్ లో వున్నంత అనుబంధం చిరుద్యోగులకి ఆఫీసులకి ఉంటుంది అవుద్యో కమిటీ సర్వే చేస్తే తెలిసిందేమిటంటే— చిరుద్యోగులు రెండేళ్లల్లో నాలుగు కుర్చీలు విరగ్గొడితే పెద్దుద్యోగులు నాగేళ్లలో ఒకటి విరగ్గొడ్తున్నారు చిరుద్యోగులు ఆ కమిటీ నివేదిక మొదటిభాగంలో యీ సంగతి చూసి 'మనకి మంచిరోజు లొస్తున్నయ్ మనం ఎక్కువగా పన్జేస్తున్నామని పైవాళ్లకి తెలిసింది మనకి బహుమానాలొస్తున్నయ్య'ని ఎదురుచూశారు కమిటీ ఫైనల్ రిపోర్టులో యిచ్చిన సలహా ఏమిటంటె అలాపకపోతే విరగ్గొట్టుతున్నారు, గనక పెద్దుద్యోగులకి బహుమానమివ్వాలని ఆ బహుమానాలు చిరుద్యోగుల జీతాల్లోంచి కట్ చేసివ్వచ్చని కూడా సూచించారు చిరుద్యోగులు ఘొల్లుమన్నారు అంతకంటె ఏం చెయ్యలేదు ఏంచెయ్యలేకపోయారు చిరద్యోగి ఫైళ్లన్నీ పక్కకి నెట్టి లేచినిలబడి గోక్కుంటె వున్న నాలుగు వెంట్రుకలో ఒకటూడొచ్చింది. డ్రాఫ్టులు సరిగ్గా కుదరక, కూడికలు సరిగ్గా రాక చికాకుతో జుట్టు పీక్కునేవాడు అలా పీక్కుని బట్ట తల్తెచ్చుకున్నాడు ఆ రోజుల్లో పొద్దున్నే వూడుస్తాని కొచ్చినవ్యాను చిరద్యోగి కుర్చీ దగ్గర కొచ్చి కిందట్రోజు చిరుద్యోగెన్ని డ్రాఫ్టులు రాశాడో, ఎన్ని కూడికలు కూడాడో చెప్పేవాట్ట కిందూడిపడ్డ జుట్టు లెక్కెట్టి చిరుద్యోగి బయల్దేరబోతూ టేబిలు మీదికి చూశాడు ఎర్ర టేబిలేసుకున్న నాలుగైదు ఫైళ్లు కళ్లెర్ర చేశాయ్ ఎర్రటేబిలు వెనకాల అంతకన్న కళ్లెర్ర చేస్తూ పై ఆఫీసరు కనిపించాడు 'రేప్పొద్దింటికల్లా ఆ డ్రాఫ్టులడి అవ్వాలన్నా' డా మధ్యాన్నం సిగరెట్టు పెగొదులుస్తూ పై ఆఫీసరు చిరుద్యోగి 'ఎస్ సార్' అన్నాడు 'అయితే వెళ్లమ'న్నాడాఫీసరు మళ్లీ వెనక్కి పిల్చి పనయితేనే వెళ్లమన్నాడు పక్కసీటు పరంధామయ్య, పక్కూరెడితే అతగాడి వర్కు కూడా తననే చెయ్యమన్నాడు అజ్ఞాసేసరికీటయివయ్యింది మరిప్పు డీ డ్రాఫ్టు సంగతేమిటి? చిరుద్యోగి క్కోపం వచ్చింది కానీ చిరుద్యోక్కోపం రాకూడదు చిరుద్యోగి క్కోపం వస్తే నవ్వుతారందరూ 'భలేవాడివే నీ క్కోపం ఏమిటీ? తప్పలాంటి పన్లు చెయ్యకొని అయినా వచ్చినా చూపించటానికెవ్వడగా లేడు కాబట్టి చిరుద్యోగి దాన్ని చికాగ్గా మార్చుకుంటాడు అదలవాటే చిరుద్యోగికి. నాలుగు ఫైళ్లనీ తీసుకుని సైకిలు వెనకాల కట్టి తాళం తీస్తూ గతంలోకి చూసుకుంటూ డొకపారి రోజూ యింటికెళ్లేప్పుడ్పేసేపనది యివ్వాళ కూడా గట్టిగా గాలి పీలుస్తూ ఆలోచించాడు తన్పదివింది ఎమ్మే చేరింది యల్డీసిగా అందులోను

పదేళ్ళ క్రితం. అక్కణ్ణించి కదల్లేదు పదేళ్ళ క్రితం .

నిరుద్యోగపర్వానికి చిరుద్యోగపర్వానికీ బోర్డరులా నిల్చి ఆరాత్రి, మర్నాటికి చిరుద్యోగి కాబోతున్న నిరుద్యోగిలా అనుకున్నాడు. 'ప్రస్తుతం యల్డీసిగా చేరినా ఓ ఏడాదిలో డిపార్టుమెంటు టెస్టులు పేస్సై యు డి సి నవుతాను ఫైళ్ళు సైకిలుకట్టి యింటికి మోసుకెళ్ళి మరీ వచ్చేస్తాను దాంతో రెండేళ్ళల్లో సూపరింటెండెంటు తర్వాతడెప్యూటీ చీఫ్ రిటయిరవ్వంగానే డిపార్టుమెంటులో వాళ్ళు నన్నేయి చేసుకోమంటాడు తన ఎం ఏ డిగ్రీనూ చూసి తన్నే సెలక్టు చేస్తారు ఆరోజు నుంచి 'కారంతా ఫైళ్ళతో నింపి కార్నలా మెయిన్ రోడ్డు మీదింటికి పంపి అడ్డరోడ్డున పరిగెత్తి కెళ్ళి కారింటి కొచ్చేవేళ్టికి కార్లో ఫైళ్ళన్నీ తీసి ముందేసుక్కూర్చుంటాను దాంతో చీఫ్ పోస్టొస్తుంది చీఫ్ అంటె రెండో మూడో వేల జీతం హో' అనుకుంటూ హాయిగా నిద్రపోయాడు చిరుద్యోగి కాబోతున్న నిరుద్యోగి.

గతం గుర్తుకొచ్చి 'హు' అని నిట్టూర్చాడు చిరుద్యోగి ఆవేళ్టికే భూలోకమంతా తిరిగి కైలాసానికి తిరిగెడుతున్నపరమేశ్వరుడు పక్కనే పరిగెడుతున్న పార్వతితో చెపుతున్నాడు 'అదిగో, పార్వతీ! పూర్వం పదేళ్ళ క్రితం అలాఅలా పైకెడ్తుననుకుని ఆశపడ్డాడే అతనే యితను బొత్తిగా గుర్తుపట్టటానికి వీల్లేకుండా వున్నాడు కదూ? కాని యితనే అతను అప్పుడెంతో పైకెడ్తాననుకున్నాడు కానీ యిప్పుడేరోజు కారోజు ఫైళ్ళల్లోంచి పైకొస్తానికి రాత్రవుతోంది పెద్దుద్యోగంలో కెడ్తానని, ఆశపడ్డా చిన్నుద్యోగంలో చేరాడు పదేళ్ళ నుంచీ యల్డీసి కౌగిల్లోంచి బయటపళ్లేదు యు డి సి దగ్గిరడ్డుపడ్డాడు. వచ్చిన నాలుగింక్రిమెంట్లు సంతోషం తెచ్చేలోపల అయిదుగురు సంతానం దాన్ని తరివేశారు దాంతో మనిషి మూర్తీభవించిన శోకమూర్తిలా తయారయ్యాడు ప్రపంచంలో వున్న నిరాశంతా అతగాడి నెత్తిన చోట్చేసుకుందుగ్గాను నెత్తి మీదున్న జుట్టంతా పీకి పారేసింది నున్నగా వున్న బట్టతల మీంచి మెల్లగా కిందికి జారి మొహమంతా పీక్కుపోయేలా చేసి మొహం మీది గుంటల్లో తిష్టవేసింది యింకా కిందికి జార్దామనుకుంది గాని కిందున్న జేబు, దానికున్న చిల్లూ కనిపించి దాంట్లోంచి కిందపడ్తానేమోనని అనుమానించి, కింద పడితే మళ్ళీ యిలాంటి వాడు దొరుకుతాడో లేదోనని భయపడి అతని మొహాన్నే వేళ్ళాడ్తోంది




'ఎందుకనిలా వున్నాడు? చేస్తాననుకున్న పన్లన్నీ అనుకున్నట్టు చెయ్యలేదా' అంది పార్వతి

'లేదు పార్వతీ అన్నీ అనుకున్నట్టుగానే చేశాడు గత పదేళ్ళల్లో సైకిలు మీద తను కూర్చునే సీటు నాలుగు తడవల మారిస్తే ఫైళ్ళు మోసే కేరేజి పదిహేడు తడవలు మార్చాడు సైకిలు వెనకాల ఎప్పుడూ పిల్లల్ని కూర్చోపెట్టిన పాపాన పోలేదు ఫైళ్ళనే మోశాడు యింట్లో అందర్దగ్గిరా చిన్న దీపాలుంచి తన్దగ్గిర లాంతరెట్టుకుని పన్నెండు దాకా పన్చేశాడు పెళ్ళావొచ్చి 'నిద్రపోండీ' అంటె 'అ ఫర్వాలేదు కిందటి నిరుద్యోగపర్వంలో యీ పర్వం నిద్ర కూడా పోయాను' అనేవాడు అన్నీ అనుకున్నట్టుగానే చేశాడు యింకా చెప్పాలంటె, అనుకున్న దానికంటె ఎక్కువగా చేశాడు. చేసుకున్న పెళ్ళాంతో కంటె చేరినద్యోగంతో ఎక్కువగా కాపరం చేశాడు తనకున్న పన్లన్నీ పోయి తనను కున్న పన్లన్నీ పర్చేపోకుండా అలానే చేశాడు. కానీ మరిచిపోయిందల్లా వక్కటే తనున్నది కలియుగంలోనని, వుంటున్నది భూలోకంలోనని అందుకే పదేళ్ళ నించి యల్డీసిగా వుంటున్నాడు ' అన్నాడు శివుడు

'యిలా అన్యాయాల్జరుగుతుంటె మన వేంజేస్తున్నట్టు మరి' అంది ఆవేశంతో పార్వతి

'పార్వతీ! ఆవేశపడకు భూలోకానికి, నిన్ను తీసుకురావడం నాదే బుద్ధి తక్కువ. భూలోకంలో జరిగే ప్రద్దానికీ నువ్వావేశపడితే కైలాసానికెడ్తాని కోపికుండదు అదీ గాక కర్మ సిద్ధాంతం సంగతి నీకు తెలీదు గనకనా? చిరుద్యోగులు పూర్వాశ్రమంలో సూర్యుడికో గొప్ప అపచారం చేశారు. వీళ్ళంతా నిరుద్యోగపర్వంలో సూర్యోదయం చూడనని పట్టేనుకున్నారు దాంతో సూర్యుడికోపం వచ్చింది అతగాడేంతక్కువ తిన్నాడా? ఎవర్చెప్పినా విన్నాడు కాదు. బ్రహ్మదేవుడ్దగ్గిరి కెళ్ళి 'వీళ్ళు నా మొహం చూణ్ణన్నారు కిందట్టడవ. యిప్పుడు

వా చాంద్రాయణం అయ్యాక వీళ్లమొహాల్ని, అక్కడున్న నిరాశని చూస్తుంటె రాత్రిళ్లు నిద్దర పట్టటల్లేదు పడితే పాడు కలలు, పీడకలలు వొస్తున్నయ్ యిలా రాత్రిళ్లు నిద్దర్లేకపోతే పగలుపన్చెయ్యలేక పోతున్నాను కావాలంటే ఫలానా వ్వాళ్ల ముస్సిపాల్టి వాళ్ల నడగండి నేను సరిగా పన్చెయ్యటం లేదుగావల్ను, వాళ్లు పగలు కూడా బజార్ల మీద తైట్లుంచుతున్నారు నాకు భయ మేస్తోంది. అందుకని వీళ్లని నేను మనో్ల కాని కొచ్చేవేళ్టికి బజార్ల మీదికి రాకుండా చెయ్యండి అలాచేస్తే నాకు నిద్రపడుతుంది వాళ్లదివరకు వా తొలి దర్శనం చేసుకోనం దుకు ప్రతీకారం తీర్చుకుంటున్నట్టూ వుంటుంద'ని చెప్పి బ్రహ్మచేత 'సరే' నని పించుకున్నాక్కానీ నిద్రపోలేదతగాడు

ఆనాట్నుంచి వీళ్లందర్నిసూర్యాస్తమయం అయ్యేసరికి కదలకుండా సూర్యుడెళ్లిన గంటకో రెండు గంటలకో వదుల్తారు వాళ్లాఫీసర్లు కాబట్టిదంతా పాప ఖర్మం శాపశేషం తప్పించటం నీతరవా? నాతరవా?' అన్నాడు పరమేశ్వరుడు మళ్లీ పరమేశ్వ రుడే మొదలెట్టాడు 'అదీగాక ప్రపంచం పెరిగి పెద్దదయ్యింది పైద య్యాక పిల్లల పెద్దవాళ్లు పెద్దాళ్లని మర్చేపోయి వాళ్ల మాట విన్రు మనవేదో పెద్దాళ్లలా వెడితే మన మాట విన్రు యింకా మనాజ్ఞ ఏమిటి వాళ్లకి? కావాల్సొస్తే ఆ పక్క కొట్లో బెల్లం బుట్ట దగ్గరున్న చీవన్జాడు ఆ కొట్టువాడి చేతిని కుట్టింది వాడు 'అబ్బా' అంటున్నాడు నేన్నికీ చిరుద్యోగి కథ చెవుతున్నాగందా యిప్పుడు దానికి కుట్టటానికి ఆజ్ఞ యివ్వలేదని నీకూ తెల్సుగా కానీ అది కుట్టింది శివుడాజ్ఞ లేకుండా చీవలు కుడ్తున్నయ్ యిహ మనుష్యులు వింటారా? అందుకని ఎందు కొచ్చిన గొడవ మన పెద్దరికం మనం వుంచుకుందాం. వాళ్ల పేదరికం వాళ్లను భవిస్తారు' అని పార్వతిని లాక్కెళ్లి పోయాడు పరమేశ్వరుడు.

చిరుద్యోగి మెల్లిగా సైకిలెక్కు

## చిరుద్యోగపర్వం

తున్నాడు పొద్దునొచ్చేప్పుడు అర్ధాంగి చెప్పీ చెప్పకుండా చెప్పిన దాంతో అర్ధం అర్ధ వయ్యింది నాల్రోజుల కిందట బుజ్జిగాడి పాల్డబ్బా అయిపోయిందిట వారంరోజు ల్నించి చెప్పినా తను మర్చేపోతున్నాట్ట తను మర్చిపోయాడా? గుర్తుంది కానీ డబ్బు ల్లేవు డబ్బా కొంటానికి యివ్వాళ్లొకణ్ణి బతిమాలి బదుల్తీసుకున్నాడు పాల్డబ్బా కొనుక్కుని కొట్టువాడు తిరిగిచ్చిన పావలా జాగర్తగా జేబులో వేసుకుని సైకిలెక్కాడు యర్లీసీగా చేర్టం మొదటితప్పు పెళ్లి చేసుకోటం రెండో తప్పు పిల్లల్ని కన్టం మూడో తప్పు' అనుకుని 'ఉస్సు' రన్నాడు చిరుద్యోగి కానీ మొదటిదీ మూడోది తనే చేసుకున్న తప్పుడు పన్లేనవిపప్పుకొంటాడు కానీ రెండో తప్పు పెద్దాళ్లుచేశారు పెద్దా ళ్లకి పెద్దయిన బామ్మ చేసింది చిరుద్యోగి బామ్మ మీదెక్కళ్లేని కోపం వచ్చింది ఉద్యోగంలో చేరిన మూడోరోజు నుంచే మొదలెట్టింది బామ్మ, 'ఒరేయ్, నువ్వో యింటివాడివైతే నా కళ్లముందు 'అంటూ 'నామీద నీకెంత ప్రేమ బామ్మా సరే, అయితే మనింటి ముందున్న యిల్లు అమ్మకాని కొచ్చిందిట అది నాకొనిపెట్టు నువ్వు చక్కగా యీ వరండాలో నుంచునో కూర్చునో రెండు కళ్లతో నన్ను పొద్దా కులూ చూడొచ్చు' అన్నాడక్కడికీ తను 'అది కాదురా నీకంతా వేళాకోళంగా వుంది పెద్ద ముండన్నాతోనా వేళాకోళం ఓ పిల్లన్జేసుకో ఎప్పుడూ వేళాకోళాలాడచ్చు నీ పెళ్లి చూసినే 'హరీ' అంటా? నంది బామ్మ అప్పుడంత తొందరెట్టింది యిప్పటికూడా హరికథలకెడ్తూ,పురాణాలు వింటూ 'గోవింద'లే కొడ్తోంది ఎలాగయితే నేం 'యింటివాణ్ణయ్యేంతవరకు యింతి వాణ్ణవ్వను .

'ఇల్లు—ఇల్లాలూ' అన్న సంగతి నీకూ తెలుసుగా' అంటూ ఉద్యోగంలో చేరిన నెల దాకా నెట్టుకొచ్చాడు పెళ్లి సంగతి. కానీ రోజూ పురాణం కూడా మానుకుని పెళ్లి రామాయణం మొదలెట్టేది 'ఏంరా, నికే పంలా సర్కారుద్యోగం చేస్తున్నావ్ పింఛ నొస్తుంది పెళ్లంటె మాట్టాడవే' అనేది.

'బామ్మా, నీకు పెళ్లిళ్ల సంగతి తెలీదు గానీ వూర్కో' అనే వాడు చిరుద్యోగి

'అవున్నాయినా, మాకేం తెల్సు, మీకు తెల్సుగాని. మేమేవన్నా పెళ్లిళ్లు చేసు కున్నావా? పిల్లల్ని కన్నావా? '' అంటూ తలా చేతులూ తిప్పేది

'అదికాదు బామ్మా యీ రోజుల్లో నాలుగొందలు జీతవొస్తేగాని పెళ్లి చేసుకో కూడ్దు ఆరొందల జీతవప్పుడుగాని పిల్లల్ని కనగూడదు నీకా సంగతే్తలీదు . అందుకని ముప్పై ఏళ్లొచ్చాగాని పెళ్లి చేసుకో గూడదు' అనేవాడు.

'ఏవిటీ ముప్పైఏళ్లా? యింకేం డెభ్బై ఏళ్లకి చేసుకోనాయినా ముప్పయే ళ్లకి చేసుకుంటాట్ట తగుదునమ్మా అంటూ • ముప్పయ్యేళ్లకెన్నేళ్ల దాన్ని చేసు కుంటావురా? పాతికేళ్ల కన్యామణినా? హవ్వ అదొచ్చిన రెణేళ్లల్లోనే నామాదిరవు తుందిరా సన్యాసి నువ్వే సన్యాసవో వుచవ్చు కోవచ్చు అందులో యీ రోజుల్లో ఆడ పిల్లలు హాయ్యోరామ! వాళ్ల కంటె యిన్నేళ్లొచ్చినా నేనే నయం అదేం వీల్లేదు గానీ, యీ జేష్టమాసంలో నువ్వు చేసుకు తీరాల్సిందే, అంది

'సరే, తర్వాత చూద్దాం.. నే నిప్పు డాఫీసుకు పోవాలి' అంటూ లేచాడు చిరు ద్యోగి

ఒకరోజు చిరుద్యో గాఫీసు నుంచి వచ్చే వేళ్టికి బామ్మ వాకిట్లో నిలబడి ఎదుర్చూ స్తోంది చిరుద్యోగి రాంగానే 'ఒరేయ్, యివ్వా ళేదో తేలాల్సిందే అదిగో, ఆ కాఫీ తాగు . యిందాక సుబ్బమ్మొచ్చింది దాని మనవరాల్ని చేసుకోమని పిల్ల ఋక్షణంగా వుంట్నుంది. హైదరాబాదులో చదువుతోందిట కూడ. మా మాదిరేం చదువుకోంది కాదు నీ చదు వుకి తగిందే ఏం తగ్గదు నేనా సుబ్బ మ్మతో ఏదో మాట యీ వారంలో చెప్ప



స్కూలు జీవితానికి ప్రత్యేకంగా విధానింపబడినది—

బిన్నీ వారి **D. 380**

సరసమైన వెలకు చూడ్డానికి అందంగా ఉంటుంది. ఎంత చెడవేసుకున్నా బాగా మన్నుతుంది. మెర్సిరైజ్డ్ కావింపబడినది.

ఎన్నిసార్లు ఉతికినా రంగు దిగకుండా ప్రకాశవంతంగా ఉంటాయి. వివిధ రకాలనుండి మీకు నచ్చినది తీసుకోండి. ఫర్నిషింగులకు కుషన్ కవర్లకు కూడా ఉపయోగకరంగా ఉంటుంది.




(అనుమతించబడిన ఈ పై బోర్డును ప్రదర్శించే బిన్నీ స్టాకిస్టుల వద్ద మీకు కావలసిన బిన్నీ బట్టలను కొనండి.)

**బిన్నీ**-బట్టలకు పెట్టినది పేరు

బెంగుళూరు ఉత్పత్తి. కాటన్ & ఊల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు. బెంగుళూరు 23 బిన్నీ & కో. లిమిటెడ్ వారి అంగసంస్థ

స్వల్పమొత్తాలుగా పొదుపు చేయండి.

'[illegible] వాళ్ళకి ఢిల్లీలో [illegible]తొస్తున్నాయట... ఇందాక మీ అమ్మ వాయన్నలతో చెప్పాను 'నీ ఇష్టం'అన్నారు. అందుకని నువ్వు 'ఊ' అను' అంది బామ్మ. చిరుద్యోగి 'హు' అన్నాడు. 'సరే వాళ్ళని ఢిల్లీ వెళ్ళమన్చెప్పు నేను బజారెడుతున్నాను అట్నించటు స్టేషను కెళ్ళి మీ సుబ్బమ్మకి ఢిల్లీకి రిజర్వుచేసొస్తాను'అని హాల్లోపెట్టిన సైకిలు బయటికి లాగి పారిపోయాడు. ఆ మర్రోజు సాయంకాలం ఇంటికొచ్చి వీధి గేటు సందులోంచి చూస్తే ఆ ఫలానా సుబ్బమ్మ, బామ్మ, ఇంకో గంగాభాగీరథీ సమానురాలు వరండాలో కూర్చునున్నారు. 'ఇదేదో తేల్చేస్తారివ్వాళ'నుకుని లోపలి క్కూడా రాకుండా అట్నించటు తిరిగెళ్ళి పోయాడు చిరుద్యోగి.. రెండురోజుల తర్వాత చిరుద్యోగికి జరమొచ్చింది. ఇదే సందను కుని బామ్మ అందరూ హాల్లో కూర్చు నుండగా హాల్లో వున్న వెంకటేశ్వరస్వామి పటం దగ్గర కెళ్ళి 'నాయినా.. వీడి జ్వరం తగ్గించు. తగ్గిస్తే జేష్టమాస వెళ్ళాక వీణ్ణి, వీడి పెళ్ళాన్ని జంటగా వెంటబెట్టు కుని నీ కొండకి తీసుకొస్తానం'ది.. అట్లా అక్షణంగా వున్న ఆ అమ్మాయి యెవర్తోనో పెళ్ళయ్యింది

ఇలా రెండో తప్పు పెద్దాళ్ళు చేసిం

# చిరుద్యోగపర్వం

దయినా మొదట్నుంచి చిరుద్యోగులేనను కుందే. అయినా గత్యంతరంలేదు. నిరుద్యోగ పర్వప్రవేశం చేసిన వాళ్ళకి స్వశక్తి మీద డిగ్రీల మీద నమ్మకం క్షీణిస్తుంది. అసలు నరజాతికి జాతీరీత్యా వొచ్చిన లక్షణమే అది నరజాతికి మూలమైన జాతికి, ఆ జాతికి ముఖ్యుడైన హనుమంతుడికి స్వశక్తి మీద నమ్మకం లేకపోవడమే కాకుండా స్వశక్తి జ్ఞానం కూడాలేదుట. లంకలో సీతుందేమో చూసిరావాలని రావుడంటే, పెద్దవా య్యుండి హనుమంతుడు చిన్న కోతులగర కెళ్ళి 'మువ్వెళ్ళగలవా? నువ్వెడా వా? అన్నాట్ట 'ఎవరెళ్ళగల రబ్బా. అంత దూరం' అని అనుకున్నాట్ట మళ్ళీ రావుడు 'నువ్వే వెళ్ళగలిన వాడివి. నీ కాశక్తుంది అన్నాట్ట. 'నిజంగానా' అంటూ ఓ ఎగు రెగిరి లంక కెళ్ళొచ్చాడు హనుమంతుడు వానరులు నరులయ్యాక తోకపోయింది గాని హనుమంతుడి కున్న ఆ గుణం మాత్రం తోకలా వచ్చింది నిరుద్యోగపర్వంలో వున్న వరులకందులోనే ట్రయినింగు అదీగాక రావుడు కాబట్టి ఎదుటివాళ్ళని 'గొప్పవాడి' వన్నాడు. ఈ రోజుల్లో డొక్కశుద్ధిలేని వాళ్ళు కూడా 'నువ్వెంతంటె నువ్వెంత .. నీ డిగ్రీలు చాలవ్' అనే వాళ్ళేకదా ముందు మాత్రం అన్ని పెద్ద పోస్టులకే అప్లయ్




చేస్తారు. తర్వాతర్వాత నమ్మకంపోతుంది. నమ్మకం కల్గించే సాధుడు కూడాలేడు. తనకున్నది 'ఎమ్మే డిగ్రీ ఏనా'అని అనుమా నొస్తుంది. ఒక్కొక్క పెద్దుద్యోగం రాకుండా పోతుంటే ఒక్కొక్క మెట్టు క్రిందికి దిగు తాడు. దానికి తోడు దండయాత్రలు కొట్టి బి ఏ కో దండవెట్టి చదువుకున్న వాళ్ళో వరూ లేని బ్రిటీషు కాలంలో ఆమెదవృక్షంలా వో వుద్యోగంలో చేరి, అదృష్టం తంతే పై పోస్టులో పడి, ఆపైనాటు కుని పాకు లాడి ఏ బాంక్ లాంటి దానికో మేనేజర్లయి నెరిసిన జుట్టునో వరసలో పెట్టుకుంటూ 'నీకెమ్మేలో ఫస్టు క్లాసొచ్చిందా?.' ఫస్టు క్లాసొస్తే ఫస్టువచ్చావా..మరి ఫస్టురాకుండా సెకండొస్తే నాలాంటి వాడి దగ్గరెట్టా పన్చేస్తావ్, నాపనీ నీ పనీ కూడా ఎలా చూడగలవ్' అంటూ 'అబ్బే, ఈరోజుల్లో ఎమ్మే అంటె మా రోజుల్లో యుస్సెల్సీ కంటె కూడా తక్కువే. ఆ చదువులే వేరు.. ఆ రోజులే వేరు.. ఆ మాస్టర్లే లేరు. సరస్వతీదేవి స్పెషల్గా వొచ్చి రెండు ఘంటలు్రదువు చెప్పేది మాకు.. మా పేం డొకడు యుస్సెల్సీ తప్పి ఎమ్మే వాళ్ళకి ప్రయివేటు చెపుతున్నా డిప్పుడు' అని సరస్వతీదేవి దత్తపుత్రుల మాటలు విన్ని నిజమేగావల్ను.. ఎమ్మే అంటే యిస్సెల్సీ గావల్ను' అనుకుని యిల్డీసి పోస్టొచ్చినా అదృష్టమే ననుకుంటారు. అలా పై పోస్టు నించి చూపులు కిందికి దింపుతూ వుండగా తను ఎమ్మేనన్న భావం, తను యూనివర్సి టీలో గడిపిన రోజులూ అన్నీ మర్చిపోతాడు. కొందరు చదివింది కూడా మర్చిపోతారు. అలా కిందికి దిగుతూ యల్డీసీ పోస్టు దగ్గర చూపులు నిలిపేస్తారు. 'మనకి లాకి ఇక్కడయితే కాంపిటీషనుండ' దను కుని, ముందిక్కడ బయల్దేరి పైకెడదాం అనుకుంటారు. అలా అనుకునే చిరుద్యో గిందులో చేరాడు.

అదే పోస్టులో వుండి తనకంటె తక్కువ డిగ్రీలు, సరిగ్గా పోస్టుకొక్కవల్సిన డిగ్రీలున వాళ్ళు వుద్యోగులు తను మాత్రం చిరు ద్యోగి. ఉద్యోగులికి వుపాయా లెక్కువా పన్తప్పించుకునే పథకాలాలోచించ గల్రు ఆఫీసరికి అవీ ఇవీ అందిస్తారు. చిరుద్యోగికి మాత్రం ఇలాంటివి చెయ్యటం చిన్నతనం. తన డిగ్రీ పెద్దుద్యోగా న్నివ్వలేకపోయినా

పెద్ద అభిమానం మాత్రం యిచ్చింది. దాంతో వ్యక్తిత్వం పెరిగింది వ్యక్తిత్వాన్ని గౌరవించని, వ్యక్తిత్వాన్నమ్ముకునే వ్యక్తులూ వునా యీరోజుల్లో దాన్నే నమ్ముకునాడు. అదే అతగాడి తప్పు. చిరుద్యోగంలో దిగజారినా చిరుద్యోగంలో వుండే వుద్యోగులేసే పన్లు తన్నెయ్యలేడు. ఆ సంగతి కొన్ని రోజుల్లోనే తెలుస్తుంది అయినా అలానే పోతూంటాడు. ఉద్యోగులు ఎన్నిసార్లాఫీసరగపడ్తే అన్నిసార్లు దండా లెడ్తారు. తనకెందుకో గిట్టదది రోజులో మొదట్టడవ కనిపించినపుడు పెడ్తాడు తర్వాత పెట్టడు అసలన్ని తడవలు పెడితే బావుండదని వుద్దేశ్యం. కానీ వుద్యోగులు ఆఫీసరెదురు పడ్డప్పుడే గాకుండా ఎదురుగా వెళ్ళి మరీ పెడ్తారు దండాలు చిరుద్యోగెదురుగుండా ఓ వుద్యోగున్నాడు పేరు వినయ భూషణ్రావు యస్సెల్సీ పేసయ్యాడు నక్క వినయాల్లో పక్కవాళ్ళందర్నీ మించాడు. 'దండం దశ గుణం భవేత్, దండం మంచి దశను ప్రసాదించును'అని చిన్నప్పట్నుంచి నూరిపోశారతగాడికి. ఆఫీసరుకి రోజుకో అరవైసార్లన్నా దండం పెట్టందే కుర్చీలో కుదురు నిలవదతగాడికి. యింకో డెక్కువసార్లు దండం పెడ్తే వాణ్ణి మించందే తోచదు ఆ రాత్రికి నిద్దరపట్టదు ఒకసారే వచ్చిందంటె. యింకో డెవరో ఎక్కువసార్లు దండ పెట్టా డాఫీసరుకని తెల్సింది వినయ భూషణ్రావుకి అప్పటికి అతగా డెక్కువగా ఓ డెబ్బయిసార్లు దండా పెట్టాడా రోజు అప్పటికి సాయంత్రం నాలుగయ్యింది పోటీ వా డెన్నిసార్లు పెట్టాడో తెల్సుకునేందకు వాడవతల కెళగా చూసి వాడి డ్రాయర్దగ్గర కెళి వాడి నోటుబుక్కు చూశాడు. వాడూ ఆ రోజు డెబ్బయిసార్లు దండపెట్టినట్టు రాసుకున్నాడు. దాంతో వినయభూషణ్రావుకి పిచ్చెక్కింది వాడెవడా తన క్కాంపిటీషనౌను న్నాడని విచారించాడు.

సరే, ఆఫీసరుగా రెళ్ళేప్పుడింకో దండం పెడితే తనే ఒకటెక్కువ పెట్టినట్లవుతుంది తనే ఫైనుంటాననుకుని ఆఫీసరు కోసం ఎదురుచూస్తున్నాడు ఆఫీసరు నాలుగున్నరకి తన రూంలోంచిబచ్చి బయటికెళ్ళబోతున్నాడు. వినయభూషణ్రావు దండం పెట్టాడు. కానీ ఆఫీసరు కోటు జేబులోంచి కాగితాలేవో తీస్తూ చూళ్ళేదు. అయితేగాడు దండపెట్టే ప్రయత్నంలో వున్నాడని అవతలి వాడుపసిగట్టాడు వీడు దండంపెడితేవాడూ భయిపడు న్నాడు అందుకని, వినయభూషణ్రావుఆఫీసరు తనమొదటిదండంచూళ్ళేదని విచారించి మళ్లీ యింకో దండపెట్టి 'నమస్కారం, సార్' అని అరుస్తుంటె ఆ అరుపు వినిపించనీకుండా చేసేందుకు 'దభేల్' మని అలమరా తలుపేశాడవతలివాడు ఆ చప్పుళ్ళో వినయభూషణ్రావు 'నమస్కారం' అన్నమాట ఆఫీసరుకి వినపళ్ళేదు అందుకని అతగాడి దండం కనపలేదు 'అయ్యో, యిదేవిటూ? లాస్టు ఛాన్సు కూడా పోయింది అని ఆలోచించాడు వినయభూషణ్రావు. వెంటనే ఓ ఆలోచనొచ్చింది యిందాక ఆఫీసరు కోటు జేబులోంచి కాగితాల్తీస్తుంటే కిందో టిక్కెటు ముక్క, బస్సుదో (సినిమాదో) పడింది. అది ఆఫీసరు చూసే వదిలాడు అయినా వినయభూషణ్రావది తీసి ఆఫీసరు కివ్వాలనుకున్నాడు యీ వుద్దేశం కూడా అవతలి వాడు కనిపెట్టి వసున్నట్టు మధ్యకొచ్చి తన చెప్పుకాలు టిక్కెట్టు మీద వేసి నిలబడ్డాడు కానీ వినయభూషణ్రావే మంచి మొహం చూశాడో అవ్వాళ ఆ అర టిక్కెటు లోసగం చెప్పు కిందుండి పక్కకి చూస్తోంది ఆ బయటికి కనబడే దాన్ని చింపుకుని ఆఫీసరు వెనకాల బయటికి పరిగెతి 'సార్, మీ ముఖ్యమైన కాగితాలేవో పడిపోయినై' అంటూ ఆయ చేతిలో పెట్టాడు 'ఓ యిదిటోయ్ ఫర్వాలేదులే' అని కింద పారేశాడు ఆఫీసరు వినయభూషణ్రావు దాన్ని మళ్ళీ కిందనించి తీసుకుని కళ్ళ కద్దుకుని 'అలాగా సార్ అయితే దాన్నక్కడ డస్ట్ బిన్లో భద్రపరుస్తాను నమస్కారం సార్' అని దండం పెట్టి వెనక్కి తిరిగొచ్చాడు నిశ్చింతగా.

అలా అందరూ పోటీ లేసుకుని ఒకడికందకుండా ఒకడు, పక్కడికీ కనబడకుండా యింకోడు, అడ్డంబడి, వెంటబడి దండాలెడుంటె చిరుద్యోగి మామూలుగా నొకసారి మాత్రం పెడ్తున్నాడు. దాంతో పెంకె ఘటమనీ, కోడి అనిపేరు బడ్డాడు. బట్టతలయినా తలబిరుసన్నారు 'ఏమ్మో అని గర్వం' అని తేల్చారందరు ఆ మాటేదో దండపెట్టి ఆఫీసర్తో అన్నారు. 'నాకు తెల్సు' అన్నాడు దండాలు పుచ్చుకునే ఆఫీసరు. అందుకని 'యి బి ' అంటె ఏవిటో, దాని చరిత్రేవిటో తెలుసుకోమనీ, అదెం తెత్తో కొలవమనీ, ఆఫీసులో అందర్నీ వొదిలేసి చిరుద్యోగికి పురమాయించాడా ఆఫీసరు.

చిరుద్యోగింటికి చేరాడు 'పిల లంతా నిద్దరోయారు పెద్దమ్మాయ్ మీ కోసం చూస్తూయిప్పుడే నిదరోయింది... అన్నం వడ్డిస్తానండి' అంది అర్ధాంగి. చిరుద్యోగి భోంచేసి 'నువ్వా వెళ్ళి నిద్దరపో' అని పెళ్ళాంతో చెప్పి నాలుగు ఫైళ్ళు ముందేసుక్కూర్చున్నాడు.

(ఇంకా వుంది)



# వైజ్ఞానిక గాథావళి - 77



# ప్రతి కార్యానికీ కారణ - ముండాలా?

- ప్లాంకూ - హైసెన బర్గూ -

- డాక్టర్ -

కారణము తెలియకుండా వచ్చే రోగాల్నీ, విఫలమైన యత్నాల్నీ కర్మ వల్లా, దైవము వల్లా కలిగేయి అని సరిపెట్టుకున్నారు పూర్వులు రోగాలకు కారణాలు సూక్ష్మ జీవులనీ యుద్ధాపజయాలకు కారణాలు అజాగ్రత్తా శిక్షణాలోపమూ లని తెలుసుకోడానికి మన వాళ్లకు చాలా కాలా పట్టింది ఈ నాటికి ఇంకా ఆ మెలకువ పూర్తిగా కలగలేదు అయితే వైజ్ఞానికాభివృద్ధీ పరిశోధనా జరగగా జరగగా కారణ అన్వేషణ ఒక పద్ధతి అయి పోయింది రోగాలకు ముఖ్యంగా కారణాల అన్వేషణ తప్పనిసరి అయింది తద్వారా 'ప్రతీ కార్యానికి కారణము ఒకటి వుండి తీరుతుందీ, అది మనము తెలుసుకోవలి' అన్న స్ఫురణ విద్యాధికులలో బాగా వ్యాపించింది

అయితే కారణము తెలియని కార్యాలు అధునిక విజ్ఞానంలో చాలా చాలా అడ్డుతగులు తున్నాయి వైజ్ఞానికులు వాటి కారణాల కోసము అట్టే అవస్థలు పడకుండా వాటి ఇతర లక్షణాలు కనుక్కునే యత్నాలలోకి వెళ్ళిపోతున్నారు

వెలుతురన్నదీ వేడిమి అన్నదీ తరంగముల వంటి గమనమని హైగెన్సు (1629 — 1695) నాటినుండి గుర్తించారూ, మాక్స్వెల్ హెర్ట్జ్ లు ఆ నమ్మకాన్ని బలపరిచారు వెలుతురన్నది ఏ వస్తువు మీద పడినా, ఆ వస్తువు పరమాణువులలోని ఎలక్ట్రానులు — కెరటము తాకిన ఈతగాండ్రవలె కెరటముతో — అటూ ఇటూ కంపిస్తాయనీ ఈ కంపనమే ఆ వస్తువు నుండి మళ్ళీ బయలుదేరే వెలుతురనీ భౌతిక శాస్త్రజ్ఞులు నమ్మేరు అయితే ప్లాంకు (1858—1947) అన్న జర్మను వైజ్ఞానికుడు "వేడిమి అన్నది వస్తువు చేత కవళముల రీతిగా విసర్జించబడుతుంది, పీల్చబడుతుంది" అన్నాడు 'తరంగశీలియైన వేడిమీ వెలుతురూ గుళికల రీతిగా కబళించబడడమూ విసర్జించబడడమూ ఏమిటు? ఏ గణితము ననుసరించి?' అన్న ప్రశ్నకు ప్లాంకు సమాధానము "అది మనకు తెలియదు కాని, అలాగ అనుకుని చేసిన అంచనాలు శాస్త్ర ప్రయోగాల ఫలితాలతో సరిపోతున్నాయి" అని వాస్తవానికి ఒక ప్రయోగము యొక్క ఫలితాలను సరిగ్గా వివరీక రించడము కోసము ప్లాంకు తన (విపరీత) క్వాంటం వాదమును ఉద్ఘాటించవలసి వచ్చింది వీన్ అన్న వైజ్ఞానికుడు తరంగ వాదన్ని అనుసరించి లెక్క వేస్తే కొబ్బెంటు ప్రయోగ ఫలితాల ఒక్క పార్శ్వానికే వైశద్యము వచ్చింది రాలే మరో దారిలో లెక్క వేస్తే రెండో పార్శ్వానికే వైశద్యము—మద్దతు— వచ్చింది ప్లాంకు, పైన చెప్పిన ప్రయోగ ఫలితాల్ని లెక్కవేసి సాధించాలంటే దీప్తి అన్నది గుళికా రూపాన్నే స్వీకరించబడుతూండాలని కనుక్కున్నాడు ఈ సిద్ధాంతము ఈ ఒక్క ప్రయోగ ఫలితాన్ని మాత్రమేకాక వెలుతురుపడ్డ లోహాలు ఎలక్ట్రానులను చిమ్మే ప్రయోగాన్నీ, విద్యుత్తు పంపిన వాయువుల వెలుగును విశ్లేషించిన ప్రయోగాన్ని సమర్థించింది కారణము తెలియకపోయినా వెలుతురు యొక్క గుళికాతత్వము ఆధునిక భౌతిక విజ్ఞానంలో చక్కగా ఇరుచుకుంది తరంగ శీలత్వమూ గుళికాతత్వమూ కూడా ఎలాగ ఉండగలవూ? అంటారు గణిత శాస్త్రజ్ఞులు ఉండగలవు అనుకోక పోతే అడుగు ముందుకి పడడములేదు ఉన్నదను కుంటేనే జరుగుతున్నవి అన్వయము అవుతున్నాయి అంటారు భౌతిక శాస్త్రజ్ఞులు

రేడియో తీవ్రత అనే గుణమున్నది యురే నియమూ థోరియమూ ఏక్టినియమూ అన్న మూలపదార్థాలకి వాటి పరమాణువులు ఆల్ఫా—, బీటా—, కణాలూ గామా కిరణాలూ అన్న మూడింటిని గానీ రెండింటినిగానీ తుప్పుమని విసర్జిస్తూ వుంటాయి ఎప్పుడూ అయితే కొంత యురే నియమును పరిశీలిస్తే అన్ని పరమాణువులూ అలా విసర్జించవు 'సగము వస్తువు అలా విసర్జించి మారి పోడానికి ఇన్ని సంవత్సరాలు' అని ఉంటుంది 1600 సంవత్సరాలకు (ఎంతో కొంత) రేడియములో సగము మారిపోతుంది మళ్ళీ 1600 సంవత్సరాలకి ఈ మారని దానిలోని సగము మారుతుంది అంటే నాలుగో భాగము మిగులుతుంది 1600 ఇంకో సంవత్సరా లకి సగము మారుతుంది అనేగాని ఏయే పైపున్న పరమాణువులు మారతాయో తెలీదు ఒక పరమాణు వుని చూస్తూండగలిగితే అది 1600 కాదు 3200, 6400, 19200 సంవత్సరాలూ కాదు ఎంతకాలము చూసినా మారుతుందో మారదో తెలీదు మారితే ఎప్పుడు మారుతుందో తెలీదూ అయితే 10 గ్రాములు రేడియము తీసుకుంటే 1600 సంవత్సరాలకు సగము మారిపోతుంది అని మట్టుకు నిశ్చయము ఈ లెక్కని పట్టుకుని వ్యవహారము చేసుకుంటున్నారు శాస్త్రజ్ఞులు కారణాలు తెలియకపోయినా

అయితే, ఒక ప్రశ్న పుట్టుతుంది "ఈ కారణా లివ్వని ప్రస్తుతానికే తెలియవు కాని, అసలు ఎప్పటికీ తెలుసుకోడానికి వీలులేదు అనా?" 'ఇప్పటికి మాత్రము తెలియని కారణాలు ఉండవచ్చును అవి కార క్రమేణా తెలియవచ్చును' అన్నట్టయితే 'అహో అలాగా సరే' అనుకోవచ్చును కాని తెలుసుకోడానికి వీలే లేనివి ఉన్నాయా' అన్న ప్రశ్నకి "ఉన్నాయి" అన్న జవాబు వస్తే ఆశ్చర్యంగా వుంటుందికదూ? వెలుతురుకి తరంగ స్వభావమూ కణస్వభావమూ రెండూ వున్నాయి అన్నాము అలాగే వస్తుకణమని వైజ్ఞానికులు గట్టిగా విశ్వసించిన ఎలక్ట్రానుకి తరంగ స్వభావము కూడా ఉన్నది అంతకంటె పెద్ద సైజు గల పరమాణువులకూ అణువులకూ కూడా తరంగ స్వభావ మున్నప్పటికీ వాటి వస్తురాశి ఎక్కువ కావడంతో తరంగ స్వభావము చాలా చాలా తక్కువవుతుంది వస్తురాశి సూక్ష్మాతి సూక్ష్మము అయిన ఎలక్ట్రానుకు కణస్వభావమూ ఉన్నది, తరంగ స్వభావమూ ఉన్నది ఇది సోదాచేస్తే ఇదీ, అది సోదా చేస్తే అదీ కనిపిస్తుంది అది చూసినప్పుడు ఇదీ ఇది చూసినప్పుడు అదీ స్ఫురించవు రెండు స్వభావాలూ వేర్వేరుగా చూడగలముగాని, ఒకేమారు రెండూ చూడలేము ఒక నాణెము యొక్క బొమ్మా బొరుసూ ఒకేమారు చూడగలమా? ఇది మన సాధన యంత్ర లోపమువల్ల కాదు ఎలక్ట్రాను తత్వమువల్ల అన్నాడు హైసెన్‌బర్గ్

మనము కనుక్కోలేని ఖగోళా లున్నాయా అని అడిగేననుకోండి ఇవాళ కాకపోతే రేపు, 200 అంగుళాల వ్యాసానిది కాకపోతే 500 అంగుళాల వ్యాసపు దూరదర్శిని నిర్మించి కనుక్కుంటాము అంటారు వీరు మననుంచి సెకనుకు 186000 మైళ్ళు మించిన వేగంతో పారిపోయే ఖగోళాల వెలుతురు మనకి వెలుతురుగా అందదు మరి అవి ఉన్నట్టు తెలుసుకోడము ఎలాగా? గుడ్డివాడున్న చోటికి చప్పుడు చెయ్యకుండా వెళ్లితే కనుక్కోలేడుగదా? కనుక వైజ్ఞానికులు కనుక్కోనివి కూడా ఉండగలవు

## సీరియల్ :




### జరిగిన కథ

మగధరాజు బింబిసారుడు ఆమ్రపాలిని చేపట్టాలనే ఉద్దేశ్యంతో వైశాలికి వస్తాడు పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు పాలికి బింబిసారునిపై ప్రేమ జనిస్తుంది మహానాముడు ప్రవేణి పుస్తకాన్ననుసరించి పాలిని దేశనర్తకిని చేస్తాడు బింబిసారుని వివాహం చేసుకున్న పాలికి తన తండ్రి నిర్ణయం తెలిసి మరణశయ్యమీద ఉన్న మహానాముని చెంతకు వస్తుంది మహానాముడు మరణిస్తాడు అతని ఆదేశానుసారం సంధాగారంలో నృత్యంచేసి అనంతరం స్మశానవాటికకు వెళ్లి తండ్రిని స్మరిస్తుంది. పాలిని స్మరించి బింబిసారుడు వాత్సల్యపూరితుడౌతున్నాడు. పాలి కోసం అనేకదేశాలవారు పడిగాపులు పడుతున్నారు.

## 18

కాలం, సముద్రం— వీటి అలల లోతు ఎవడైనా గ్రహించాడా? రోజులు గడవసాగాయి ఆమె చేపట్టిన మార్గాన్ని నిర్వహించడమే కర్తవ్యమని రేణుక నిజమే చెప్పింది. క్రమంగా పాలికి అనేకమంది యువకులతో సంపర్కం ఏర్పడసాగింది ఆ యువకుల ముగ్ధావస్థ, కల్పన, ఉన్మాదం, బుద్ధి, ధైర్యం, మూఢత్వం— వీనితో నిండిన ప్రదర్శనలోనే పాలి సమయం హాస్యం, వినోదం, వ్యంగ్యంలో గడవసాగింది అందరినీ మూర్ఖులుగా చేసే కళ ఆమెకు రేణుక చక్కగా నేర్పింది పాలి అందరినీ మూర్ఖులుగా చేయసాగింది ఆమె ఎదుటికి వచ్చే పురుషుడు ఎవడైనా ఆమె బుద్ధి చేత ప్రభావితుడవుతున్నాడు

తిరిగి ఒకసారి ఆశ్వయుజ పూర్ణిమ వచ్చింది. వజ్జియులను విడిచి లిచ్ఛవీయులకు సమీపంలో ఉన్న అనేక గణతంత్రాల్లో పాలి ప్రశంస, ఆమె నృత్యాన్ని చూడ్డానికి అక్కడి రసికులైన యువకుల్ని ఆతురులుగా చేసింది సంవత్సరాల నుండి లిచ్ఛవీయులకు శత్రువులుగా ఉండిన అక్కడి భల్ల, శాక్య, కేలి గణాలు ఆమ్రపాలిని చూడ్డానికి ఆశ్వయుజపూర్ణిమ నాటికి లిచ్ఛవీయులతో సంధి చేసుకున్నారు తత్ఫలితంగా పాలి, సంధాగారం రాజ కర్మచారుల కృతజ్ఞతకు పాత్రురాలైంది కారణం, ఆమె నిజంగా దేశనర్తకి పేరు రాజ నైతికంగా సార్థకం చేసి చూపించింది కాబట్టి ఈ సంవత్సరం లిచ్ఛవీయ గణం పాలి నాట్యాన్ని చూడ్డానికి అధికమైన ఆతురపాటు చూపడంలో ఆశ్చర్యమేమీలేదు ఇంత తక్కువ కాలంలో పాలి తన గొప్పతనాన్ని స్థాపించింది. నృత్యకళ కూడా ఆమె శరీరావయవాల్ని దీప్తివంతం చేసిందో అన్నట్లుంది. ఏ యువకుడైనా ఆమె నాట్యాన్ని చూడ్డానికి ఎంత గొప్ప కీడునైనా సహించడానికి సిద్ధంగా ఉన్నాడు

జనుల మితిలేని ప్రశంస, ఆదర సత్కారాలనూ ఆమె ఒక విధంగా తన జీవిత సాఫల్యంగా ఎంచ సాగింది నృత్యం ఆరంభించగానే ఆమె తన ఆనందంలో మునిగిపోతుంది ఆమెకు గాఢమైన మానసిక, తృప్తి కలుగుతుంది ఆమె తన మహలుకి వచ్చి నిశ్చేష్ట అయినంతవరకూ ఆ అనుభూతి అట్లే ఉంటుంది

ఆశ్వయుజపూర్ణిమామహోత్సవం ఆరంభమైంది పాలి గత సంవత్సరం లాగే ఈ సారి కూడా ఉత్సాహంతో నృత్యం చేసింది నృత్యం సమాప్తమైనపుడు ప్రేక్షకులు గత వత్సరం కంటె అధికంగా ఉన్మత్తులైనట్లు కన్పిస్తున్నారు పాలి తన మహలు వైపు పోసాగినప్పుడు ఆమె రథం వెనక ఉపహారాలతో కూడిన నాలుగు ఏనుగులూ ఆరు రథాలూ ఉన్నాయి ఈసారి పారితోషికాలూ, ఉపహారాలూ ఇంతగా ఉన్నాయి

పాలి మహల్లో అడుగు పెట్టగానే వృద్ధ రేణుక ఆమెను కౌగలించుకొని లోపల ఉన్న విశ్రాంతి కక్ష్యకు తీసుకుపోయింది ఒక కన్ను పోవడంవల్లనూ, రెండో కన్ను బాధ పెట్టడం వల్లా రేణుక పాలి వెంట వెళ్ళేదు ఆమె కళ్లల్లో నీరు పెట్టుకొని అంది— 'బిడ్డా, మేము తరచు విశిష్ట పురుషులనే ఆనందింప చేశాం కాని నీవు నేడు సమస్త దేశాన్నీ ఆనందంలో ముంచావు నీవు దేశానికి ఉపకారం చేశావు. నిజంగా నీవు దేశనర్తకివి ' పాలి ఏమీ మాట్లాడలేదు రేణుక కన్నీళ్లు తుడిచి ఆమె మహలు ద్వారం దగ్గర నిలబడ్డ ఎందరో లిచ్ఛవీయ సుపుత్రుల వైపు సంకేతం చేసి అంది— 'నేను వీరికెంతో నచ్చచెప్పి అలసిపోయాను నేనూ మానవినీ, నాకూ, ఆకలి, అలసటల తరవాత విశ్రాంతి అవసరమనీ నీవిప్పుడు వీళ్లకి నచ్చచెప్పు '

వాళ్ల వేపు చూచి వృద్ధ రేణుక కంటి బాధ మరచి అంది— 'ఇక్కడ నిలబడ్డ మాత్రాన్నే వారి మనసు తృప్తిపడితే, నిలబడనీ, పాపం బాలురు ' అని ఆమె పాలిని స్నానాగారానికి తీసుకుపోయింది తరవాత ఆమె చాలామంది దాసీలను వెంట తీసుకొని వెలపలికి వచ్చి, ప్రాసాద ప్రాంగణంలో నిల్చియున్న యువకుల నుండీ, ఉద్యానంలో నిల్చియున్న పరదేశుల నుండీ, అన్యప్రజల నుండీ ఉపహారాలు స్వీకరించి వాళ్లకు శీఘ్రంగా బోధింప నారంభించింది

స్నానం చేసి పాలి శయనాగారంలో ప్రవేశించింది తన ఉత్తరీయాన్ని తొలగించడానికి ముందు బిగ్గరగ అరచి కూర్చుంది.

ఆమె పోగొట్టుకున్న సోదరుడు ఆనందుడు ఎదుట నిలబడ్డాడు అతని దుస్తులు పూర్తిగా మారిపోయాయి ఆ వస్త్రాలు పరివ్రాజకునివి కావు, శ్రమణేరకునివికావు, జటిలకునివీ కావు అగ్నిపూజకునివి గాని, బ్రహ్మచారివిగాని కావు అవి వేరే రకం కాషాయ వస్త్రాలు, ఆనందుని కన్నులు ఒక విధమైన ఉన్మాదం చేత అభిభూతమవుతున్నాయి.

'సోదరా, సోదరా' అని పాలి అరచి ఆనందుని బాహువుల్లో చేర్చుకుంది చేర్చుకోడమే కాదు, ఏడవ నారంభించింది కొంచెం సేపు పాలిని ఓదార్చి ఆనందుడామెను దూరం చేసి, 'పాలీ, నా వైపు చూడు' అన్నాడు

పాలి అతన్ని చూసింది

'పాలీ, మూడేళ్ల నుండి నేను మనస్సును అణుచుకుంటూ వస్తున్నాను నేను హృదయాన్ని తొక్కివేశాను వనాల్ని, ఉపవనాల్ని, గిరి కంధరాల్ని మర్దించాను శాక్యముని గౌతమ బుద్ధుని ఆదేశాన్ని మనస్సులో ఉంచుకొని ప్రతి వృక్షం క్రిందా పద్మాసనం వేశాను కాని నిన్ను మరచిపోలేకపోయాను కాదు, నిన్నుగాదు, నీ పుత్రుని నా హృదయంలో అదే ఒక ధ్వని లేస్తోంది కాదు, వాడు లేనిదే నాకు శాంతి కలగదు సోదరీ నేను



వాణ్ని తీసుకుపోడానికి వచ్చాను నీ పుత్రుని నాకు ఒప్పగించు!

'సోదరా, నా హృదయాన్ని తీసుకుపో నాకది అవసరంలేదు ఈ హృదయాన్ని నేనెంతో అణచాను, మర్దించాను కాని అది యింకా జీవించి ఉంది దీన్ని పెల్లగించి లాగుకొని పో పిల్లవాణ్ణికాదు నేను వాణ్ణి వ్వలేను'

'కాదు పాలి, అభ్యంతర పెడితే కార్య మెలా జరుగుతుంది? నేనతన్ని తీసుకు పోతాను తీసుకుపోడానికే వచ్చాను చీకటి వ్యాపిస్తోంది దట్టంకానీ, నేనిప్పుడు వాణ్ణి తీసుకుపోతాను'

ఆనందుని నేత్రాల్లోని ఆ ఉన్మాదం అణిగి ఇప్పుడక్కడొక విచిత్రాకర్షణ కన్పిస్తోంది పాలి ఒక్కసారిగా ఏమీ మాట్లాడ లేకపోయింది బాలుని ఉయ్యాల దగ్గరికి వెళ్లి, వాణ్ణి లేవదీసి, కౌగలించుకొని, వేగంగా ఏడవసాగింది ఆమె రోదన స్వరం కఠోర హృదయుడైన పురుషుడు సహితం ద్రవించేటంత కారుణికంగా ఉంది ఆనం [illegible] కూర్చుని అన్నాడు 'సోదరీ, నీవు దేశనర్తకివయ్యావు దేశనర్తకికి ఎక్కడైనా కొడుకుంటాడా? ఇతని భాగ్యమెలా ఉంటుందో? తండ్రి కూడా ఇతడు కావాలని కోరడు తల్లి ఇతన్ని ప్రకటంగా పెంచలేదు పెద్దవాడయ్యాక నీ కొడుకు మంచి చెడ్డ మాటలనేకం విని ఏమి యోచిస్తాడు? ఇతడు రాజవంశంలో పుట్టాడు కాబట్టి ఆత్మహత్య చేసుకో కుండా ఉండలేడు ఇది సాధారణమైన ఆత్మ కాదు వీడు నీ దగ్గర ఉండడానికి యోగ్యుడు కాడని నా మనసు చెప్తోంది'

'అట్లనకు, సోదరా అలాంటి అశుభం పలకకు'

'నేను ఒకటి రెండురోజుల నుండికాదు, పాలీ, దినాలు మాసాలు వర్షాలు నుండీ దీన్నే ఆలోచించాను నాకిచ్చి వెయ్యి నాకివ్వడంలోనే నాకు, వీడికి, నీకు కూడ రక్షణ ఉన్నట్లు నా మనస్సు, ఆ భగవంతుడు కూడా చెప్తున్నారు కాలం వ్యర్థం చెయ్యకు సోదరీ ఇది ఐహిక పారలౌకిక సంబంధాల్ని ఇచ్చి పుచ్చుకోవడం నాకు ఒప్పగించు, నాకియ్యి, తొరపడు' ఇలా అని ఆనందుడు చేతులు చాచాడు అతని మాటలలో కాఠిన్యంతో బాటు స్పష్టమైన ప్రేమ కూడా తొలకాడుతోంది అతని వాణి మర్మభేదిని అయినా ఆర్ద్రంగా ఉంది

పాలి మనస్సు బాలుణ్ణి ఇచ్చి వెయ్యడానికి సిద్ధమైంది ఆ ఒకటన్నర సంవత్సరాల్లో ఆమె ప్రపంచంలోని సుందర స్వరూపాన్ని జుగుప్సాకరమైన రూపాన్నీ చూసింది సోదరుని మాటలు ఆమె హృదయానికి గ్రుచ్చుకున్నా, అవి సత్యాలని ఆమెకు తెలుసు. ఆమెకు నచ్చచెప్పవలసిన అవసరంలేదు

కాని ఆమె మాత! 'నీవు వీణ్ణి ఎక్కడికి

తీసుకుపోతావు?' అని ఆమె క్రోధం అణచు కొని అంది—

'నేను వెళ్ళే చోటుకు, శాక్యముని బుద్ధుని భిక్షుక బృందం నివసించే చోటుకు, తథాగతుని పేరు మార్మ్రోగే చోటుకు'

'అయితే నేను వీడి నెలా చూడగలుగుతాను?'

'పాలీ, చూడనవసరమేముంది? నీవు వీడి నెన్నటికీ చూడలేవు'

'సోదరా, నీ వింత కఠినుడవెలా అయ్యావు? నా సోదరు డెక్కడ మాయమయ్యాడు? కాదు, కాదు వాడిక్కడుండడమే మంచిది పెద్ద వాడయ్యాక నన్ను తల్లి అని అనక పోయినా, నా మీద ఉమ్మినా, నన్ను చూడ గోరకపోయినా, నేను వీణ్ణి నా దృష్టిలోంచి అదృశ్యుణ్ణి కానివ్వను'

విలపిస్తున్న పాలి రెండుచేతులూ తన చేతిలోకి అతి ప్రేమతో తీసుకుని అతడు బోధింపసాగాడు 'పాలీ, నీ పుత్రుడొక గొప్ప దైవీవిభూతి కాగలడని వృద్ధ వేదాంతి చెప్పాడు నీవు వీణ్ణి పెంచుతే యౌవనం రాకుండానే వీడు స్వయంగా తన్ను ధిక్కరించుకుంటాడు ఇతనికి తనపై మాత్సర్యం కలుగుతుంది తుదకు అవమానాలచేత దుఃఖితుడై ఆత్మహత్య చేసుకుంటాడు నా మేనల్లుడికి, ఒక రాజకుమారుడికి నేన లాంటి స్థితి రానివ్వను దీన్ని అంతవరకూ పెరగనివ్వను వీణ్ణి నా కిచ్చెయ్యి వీడు మనల్ని ఉద్ధరిస్తాడని పూజ్యవేదాంతి చెప్తున్నాడు కాబట్టి నేను వీణ్ణి నీ నుండి దూరంగా తీసుకుపోడానికి వచ్చాను అప్పుడు వీడు నిన్ను చూడలేడు ఒక సారైనా మీరిద్దరూ ఒకరి నొకరు కలుసుకున్నారా? నీ వాత్సల్యం ఇతని జీవితాన్ని శూన్యంగా చేసి వేస్తుంది'

'సోదరా నేను వీడి తల్లిని'

'ఏ లిచ్ఛవీయమాతైనా తన పుత్రుని సుఖం కంటె తన సుఖం ఎక్కువని అనుకుందా?'

'సోదరా, ఇది అసంభవం'

మళ్లీ అతని కళ్లల్లో స్థిరమైన కాంతి ప్రకాశింప సాగింది 'పాలీ, నీ సోదరుని మాటల్లో నీకు విశ్వాసముందా? బాలుని నాకు వశపరచు' ఇది ఆజ్ఞ పాలి శోభాహీన అయింది ఆమె బాలుని ఒలంగా వక్షానికి హత్తుకొని, ముద్దాడి, సోదరుని చేతుల్లో ఉంచింది

'పాలీ, బౌద్ధసాధువు యజమాని చేత స్పష్టమైన హృదయంతో నవ్వుతూ ఒసగబడ్డ భిక్షనే గ్రహిస్తాడు పాలీ, నా వైపు చూడు'

పాలి చాలా యత్నించి మనస్సును సంభాళించింది మందహాసం చేసింది 'బుద్ధభగవానుడు రక్షకుడగు గాక' అను ఆశీర్వాదంతో ఆనందుడు బాలుణ్ని తీసుకున్నాడు పాలి నవ్వుతూ పాదాలపై బడింది

* * *

ఏడేళ్లు గడచాయి. ఈ ఏడేండ్లలో పాలిలో అచింత్య పరివర్తనం కలిగింది. దూర దేశాల వరకూ ఆమె ప్రఖ్యాతి పొందింది సంధాగారంలో సభ జరగనప్పుడు, పాలి అక్కడికి వెళ్ల నవసరం లేకపోతే ఆమె ఎవడైనా గొప్ప రాజు ఆహ్వానాన్ని అంగీకరించి వైశాలికి వెలపల కూడా కాలు పెట్టసాగింది సంవత్సరంలో అనేకసార్లు పాలి రథం జయ నాదాలతో వైశాలిని విడుస్తోంది పాలి ఖ్యాతి అనేక రహస్య కథల రూపం ధరించింది. పాలి ఏ నగరానికి పోతుందో ఆ నగరంలో ఆమె వచ్చిన మొదటి రోజూనా, వెళ్లిన మరుసటి రోజూనా పను లన్నీ జరగనట్లే ఉంటాయి

నగరంలోని రసిక సమాజం పాలి రూప గుణాలను గురించిన సత్యాసత్య వచనాలలో తమ కాలాన్ని గడపుతున్నారు. కాని వైశాలికి కూడా కొంత మేలు కలుగునప్పుడే పాలి వెలపలికి వెడుతూండేది క్రమంగా తన నృత్యకళ, దేహకాంతుల సహాయంతో పాలి మాటిమాటికి పోరాడుకొనే లిచ్ఛవీయ రాజులకు, రాజ ప్రతినిధులకు మధ్య ఐకమత్యం కలిగించింది దానిచే వాళ్లు కలుసుకొని శాంతించారు ఆ కాలంలో దాదాపు లిచ్ఛవీయ వజ్జియ నాయకులందరూ పాలి వశీకరణ మంత్రంలో పట్టుబడ్డారు భీషణ యోధులు, సంయమంగల పురుషులు అనేకుల నోటి నుండి కూడా 'లేదు' నుండి 'అవును' అని చెప్పించడంలో ఆమె సమర్థత కలిగి ఉంది ఆమె అందరినీ ముగ్ధుల్ని



చేసింది. ఆమె రూపం అనే వశీకరణ మంత్రంలో వైమరచిన పురుషుడు ఆమె కోరితే కాదనడానికి సాహసించలేకపోయేవాడు.

కాని మహానాముని మరణానంతరం లిచ్ఛవీయుల్లో ఒక విధమైన నీచమైన స్వేచ్ఛ వ్యాపించ సాగింది ఇది ఒక విధమైన అరాజకం. ఇది ఈ ఏడేళ్లలో భీషణ రూపం దాల్చింది. ధర్మప్రవర్తకు లెందరో స్వేచ్ఛా ప్రియులైన లిచ్ఛవీయులను ఉత్తేజితుల్ని చేయ డానికి ముందుకు వచ్చారు వాళ్లల్లో జటిలకులు, నిర్గ్రంథుల ప్రచారం వైశాలిలో ముఖ్యమయింది మరో వైపున ఎందరో సామ్రాజ్యవాదులూ, కూట నీతిజ్ఞులూ పరిషత్తులోని ఎందరో నాయకుల్ని ఉత్తేజితులను చేసే పన్నాగంలో సఫలులవుతూండిరి. నియమానుసారం ఎప్పుడూ లిచ్ఛవీయ పరిషత్సభలు సంథాగారంలో జరుపబడేవి ప్రవేణి పుస్తక నిర్ణయం అంతిమమని అంగీకరింపబడుతూండేది. నేటికీ లిచ్ఛవీయ గణతంత్రం అభేద్యమూ, ప్రభావవంతమూ అయి ఉంది. కాన్నీ ఉన్నా పూర్వం ఏ విధంగా ఒక భావనతోటే, విశ్వాసంతోటే ప్రతికార్యమూ సంపాదితమవుతూండేదో, ఇప్పుడలా అవడంలేదు. పురాతన

# ఆమ్రపాలి

నాయకుల్లో చివరకు మిగిలిన సాగరశ్రేష్ఠి కూడా మరణించాడు.

అట్టి రోజుల్లో శాక్యముని గౌతమ బుద్ధుని ధర్మం లిచ్ఛవీయుల్ని ఊపివేసి చైతన్యవంతంగా చేసింది. క్రమంగా ఇతరదేశాల కంటె లిచ్ఛవీయ గణం బౌద్ధధర్మాన్ని అధికబలంతో అవలంబింపసాగారు. బుద్ధానుయాయులు కానివారే ఆ కాలంలోని అరాజకంవల్ల శంకాశీలురు, క్రూరులు, లజ్జావిహీనులు అయ్యారు ఈ పరిస్థితిలో లిచ్ఛవీయ గణమంతా ఏక దృష్టితో గౌరవించు వ్యక్తి ఆమ్రపాలి. మానసికంగా ఆమ్రపాలి శాసనమే వైశాలిలో సాగుతోందన్నట్లుంది దినదిన ప్రవర్ధమానమైన పాలి శరీర సౌష్టవం అందర్నీ ఓడించింది. ఈ ఏడేండ్లలో పాలి తన పాంచభౌతిక శరీరానికి క్రొత్తరంగు వేయడానికి శక్తివంచన లేకుండా యత్నించింది. పుత్రుని ఎడబాటుతో ఆమె జీవిత లక్ష్యం మారినట్లుంది. నిరంతరాభ్యాసం వల్ల ఆమె సుకుమార శరీరం సహన శీలం గలదైంది. హృదయ రోదనాన్నణచి పాలి ముఖం ఎనిమిది జాములూ మందహాసం చేస్తుంది. తన మనోవేదనను కప్పి పుచ్చడాని కామె ఎన్నోసార్లు నవ్వుతుంది, నవ్విస్తుంది. ఇలా దుఃఖాన్ని మరవడానికి యత్నింపసాగింది.

పాలి ప్రాసాదంలో చాలరోజుల నుండి ఉజ్జయిని నుండి పారివచ్చిన రాజకుమారుడొకడు నివసిస్తున్నాడు. నేడు వివిధములైన మాటలాడి పాలి అతన్ని ప్రఫుల్లుని చేస్తోంది. తన పుత్రునితో సమానుడైన రాజకుమారుడు తన కోసం ఉన్మత్తుడవడం చూచి పాలి సానుభూతితో మందహాసం చేసింది. తుదకు రాజకుమారుడు పాలి మాట ఒప్పుకున్నాడు. ఇంటికి పోయి తండ్రిచే నిశ్చితమైన కన్యను వివాహ మాడడానికంగీకరించాడు. ఇంతకు పూర్వం ఈ రాజకుమారుడే పాలి లేకపోతే జీవింపనని నిశ్చయించుకున్నాడు!

అలాంటి అనుభవాలు పాలి జీవితంలో అనేకం గతించాయి. రాజకుమారుని వచనంతో ఆమె సంతుష్టి పడింది అకస్మాత్తుగా దాసి సునేత్ర వచ్చి సమాచారం చెప్పింది.

'ఒక పరదేశి దర్శనం చేయడానికి అనుమతి కోరుతున్నాడు.'

'వెయ్యి కహాపణాలు ఇచ్చినా అనుమతి లభించదని చెప్పు!'

'అతడు రెండు వేలిచ్చాడు. నేను తీసుకున్నాను!'

'అయితే ఇచ్చివేయి.'

'అతడు నాలుగు వేలయినా ఇవ్వగలడు, దేవీ, అతడు నాతో మొదటే చెప్పాడు.

'నాలుగువేల కహాపణాలను గూడా ఇచ్చివేస్తే?'

'ఎనిమిది వేల నిస్తాడు. మీరు దర్శనం ఇచ్చేదాకా అతడు మరలిపోడు.'

'వెళ్ళు, పిల్చుకురా.'

'అతడు ఏకాంతం కోరుతున్నాడు, దేవీ.'

పాలి ఆబాల రాకుమారుని వైపు చూచి అంది 'వసంతరాజా, నీవు కొంతసేపు ఉద్యానంలో నడావు. నే నిప్పుడే వస్తాను... సునేత్రా, వెళ్ళి అతన్ని ముఖ్యభవనానికి తీసుకురా.' ఇలా అని పాలి ముఖ్యభవనానికి వెళ్ళి చేరింది. సునేత్ర పరదేశిని లోపలికి పంపి వెలపల ద్వారాలు బంధించింది.

పరదేశిని చూడగానే పాలి స్తబ్ధురాలైంది. 'పది సంవత్సరాల క్రిందట ఒక పుత్తలికల వాడు వచ్చాడు నేడు ఆ మహాలుకే ఆ స్థానంలోనే మళ్ళీ ఒక కర్రబొమ్మల వాడు వచ్చాడు. కాని నేటి పురుషుడు మరొకనిలా ఉన్నాడు ఇతడు కూడా బింబిసారుడు కాడని ఎవరు చెప్పగలడు? ఏళ్ళు గతిస్తే అతనిలో మార్పుకలగదా?'

పాలి మాట్లాడ లేకపోయింది. పరదేశి చేయి పట్టుకొని అతన్ని ఆమె తన శయన గృహంలోకి తీసుకుపోయింది. ఆమె అక్కడి ప్రతిద్వారాన్నీ, గవాక్షాన్నీ మూసి వేసింది. సంవత్సరాల నుండి ఆపబడ్డ ఆవేగం ఒక్కసారిగా వెలువడగోరిందా అన్నట్లు ఆపు చేయబడిన ఆమె కన్నీళ్ళు ధారగా ప్రవహింపసాగాయి. ఎవరూ చూడలేరనే విశ్వాసం కలిగిన తరవాత పాలి పరదేశిని పరీక్షించింది. కాని పుత్తలికలవాడు గడ్డాన్ని పీకి వేశాడు. ఇది చూచి పాలి పొంగు అకస్మాత్తుగా శాంతించింది.

ఆ ఆగంతుకుడు బింబిసారుడే అని ఆమూర్ఖురాలు అనుకుంది కాని అతడు సంజయుడు అతడు తన వేషాన్ని మార్చి పాలి పాదధూళిని తీసుకున్నప్పుడే పాలితన్ను ఆపుతున్నట్లు అతనికి తెలిసింది... సంజయుణ్ణి చూచినప్పుడు ఆమెకు అమితమైన సాంత్వనం లభించింది.

సంజయుడు వ్యర్థమైన ఆలస్యం చెయ్యక ముఖ్య విషయానికి వచ్చాడు. అత

డన్నాడు— 'దేవీ, నా దగ్గర ఏ విషయాన్నీ దాచడానికి ప్రయత్నించకు. రేవా నాకంతా చెప్పింది. నేను ఏడు సంవత్సరాల నుండి మిమ్మల్ని కలుసుకోవాలని కోరుతున్నాను కాని సమయం లభించినా వ్యవధి చాల తక్కువ. నేను వైశాలిలో ఉన్నట్లు ఇక్కడి గూఢచారులకు తెలిసిపోయింది. కావున నేను చెప్పేదంతా శీఘ్రంగా విను, దేవీ నేను మిమ్మల్ని భిక్షం అడగడానికి వచ్చాను.'

'ఒక నర్తకినా?'

'కాదు, నా మహారాణిని.'

'ఇలా అనకు, మహాసచివా.'

'మీరు చేసిన దేశసేవ, ఆత్మత్యాగం ఏ సామ్రాజ్ఞీ చేయలేదు ఆమ్రపాలి కేవలం నర్తకేకాదు, ఆమె దేశోద్ధారిణి, కులోద్ధారిణి, ప్రేమదేవి. దేవీ, ఏడేళ్ల నాటి పాత దెబ్బ మహారాజు మరలేదు. ఏడేళ్ల నుండి నా మహారాణి మహారాజును ఆతురపాటుతో మరచి ఉందని నేనెరుగుదును నేను ఏ విషయాన్నీ గుప్తంగా ఉంచలేను ఈ విషయం మీకు బాగా తెలుసు!'

పాలి కన్నీటిని కప్పి పుచ్చడానికి ముఖం త్రిప్పి అడిగింది— 'మహామంత్రీ, ఏ పనికై వచ్చావు?' సంజయుడు క్రింద కూర్చుండి జవాబిచ్చాడు 'మీ శుభహస్తాలతో మీకు మహారాజును సుఖవాసిగ చేయడానికి'

పాలి అదరిపడి సంజయుని వైపు చూసింది అతని కళ్ళు చెమ్మగిల్లాయి సంజయుడన్నాడు—

'దేవీ, మీరు తెలునుండే మీ కొరకు మహారాజు హృదయంలో రగులు కొల్పిన మాత్సర్య జ్వాల ఇప్పుడు ప్రజ్వలితమై అగ్నిరూపాన్ని ధరించింది లిచ్ఛవీయుల విరోధం ఇప్పుడు మగధ మీద వ్యాపిస్తోంది ద్వేషం పెరిగింది కార్పణ్యం వ్యాపించింది కాని లిచ్ఛవీయ మాగధీయుల కలహం శాశ్వతంగా శాంతించడానికి ఇప్పుడొక అవకాశం చేజిక్కింది'

తీవ్ర వేదన కూడా పాలిని చలింపజేయ లేదు ఆమె అంది— 'నీవు లిచ్ఛవీయ మాగధీయ మైత్రిని ఎందుకు కోరుతున్నావు?'

'మొదటిది, రెండు శక్తివంతములైన రాష్ట్రాలు ఒకటిగా అవుతాయి కాని దాని కంటె అధిక మహత్త్వం గల విషయమేమంటే, నా మహారాణి ఒక సమయంలో అతని.....'

'చాలించు, మహామంత్రీ, నేను నర్తకిని.'

'చెప్పినంత మాత్రం చేత, ఒప్పుకున్నంతమాత్రం చేత ఏమైనా జరిగితే నేనిప్పుడే ఇంద్రుణ్ణవుతాను. ఇంద్రుణ్ణి అయ్యాక నాకిక్కడికి రావలసి యుండదు. నేను నా దివ్యశక్తుల సహాయంతో ఈ భేదభావాలనీ, నా విరోధాలనీ, దుష్టబుద్ధినీ— అన్నింటినీ దూరం చేసి ప్రతి మనుష్యుణ్ణీ లిచ్ఛవీయుని చేస్తాను...

'లిచ్ఛవీయుల యెడ ఇంత అనురాగం ఎప్పటి నుండి కలిగింది, మహామంత్రీ?'

'నిజమైన లిచ్ఛవీయుడే మనుష్యుడని పించుకోడానికి యోగ్యుడవుతాడు. క్షమించు. నేను నేటి లిచ్ఛవీయుణ్ణి గురించి చెప్పడం లేదు.'

'అయితే, నాలోని భేదభావాన్నీ, అనైక్యాన్నీ, దుర్బుద్ధినీ దూరం చెయ్యవచ్చావా?'

'అవును, దేవీ, మహారాజు బింబిసారుని దృష్టి రాజకుమారి చేలనపై బడింది. గత వత్సరం మీరు చేలన దగ్గరకు నృత్యం చేయడానికి వెళ్లారు. కొన్ని దినాలు ముందుగానే మీరక్కడికి వెళ్లారని నేను విన్నాను. చేలన మనస్సు మహారాజు వైపు త్రిప్పబడితే, ఇద్దరికీ వివాహమైతే మాగధీయ లిచ్ఛవీయ స్నేహబంధం చాలా కాలం వరకూ బలంగా ఉండడం చాలా సంభవం అవుతుంది ఏ మహోద్దేశంతో మీ ప్రేమికులిద్దరూ వివాహ గ్రంధిలో బంధితులయ్యారో, ఏ ఉద్దేశ్యం అసంపూర్ణంగా ఉండిపోయిందో, ఇప్పుడది సంపూర్ణం కావలసిన అవకాశం వచ్చింది. అది మీ చేతుల్లో పూర్తి కాగలదు.'

పాలి ధ్యానపూర్వకంగా ఈ మాట వింటూంది. అకస్మాత్తుగా నిలబడి ఆమె అంది, 'సంజయా, ఆలోచించి చెప్తాను.'

'దేవీ, ఇది ఆలోచించే ప్రశ్నకాదు, చేయవలసింది. మీ ఆత్మబలి మహారాజుకు అమిత దుఃఖం కలిగించింది. లిచ్ఛవీయుల యెడల ఆయన మనస్సులోని రోషానికి ఇదే ముఖ్య కారణం. చేటక రాజపుత్రి చేలన పొందుచే ఈ రోషం అవశ్యం తగ్గుతుంది. మా రాష్ట్రాన్నీ మీ రాష్ట్రాన్నీ సుఖవంతం చేయడానికి ఇది చక్కని అవకాశం. మీరీ కార్యం తప్పకుండా చేస్తారు కూడాను. మరో ప్రశ్న అడగనా?'

'అడుగు'

'యువ రాజెక్కడ?'

'మహామంత్రీ'—పాలి కేక వేసింది; తిరిగి వెంటనే స్వస్థత పొందింది. తానకస్మాత్తుగా అరచినందుకు ఆమె సిగ్గుపడింది. ఆమె శరీరమంతా కంపిస్తోంది. దారి హృదయమందింకా అధికంగా సహించే ఓర్పులేదు పాలి శయ్య మీద పడిపోయింది. కన్నీళ్లు ప్రవహింప సాగాయి... 'ఏడు సంవత్సరాలయిన తర్వాత పతి సంగతి తెలిసిన తర్వాత ఆమె మాత్సర్యంతో నిండిపోయింది. ఇప్పుడు పతికి పరమమిత్రు డొకడు చేతిలో నుండి జారిపోయిన పుత్రుణ్ణి జ్ఞాపకం చేస్తున్నాడు.

(సశేషం)

కళ్ళు నెత్తిమీ దెట్టుకొని కొన్నారా—
ఈ ముదురు బెండకాయలు!!

# వారఫలం

## 30-9-1966 శుక్రవారం మొదలు 6-10-1966 గురువారం వరకు.

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో పోటీవారితో పోటీ పెరగడంవలన తరచుగా మీ కార్యక్రమా లను మార్చుకోవలసివస్తుంది. అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు విలాస వస్తువులు కొంటారు.

**వృషభం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో వ్యయప్రయాసలకు గురి కావలసి వస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**మిధునం :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగానే సాగుతాయి. కాని వారాంతంలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంత వరకు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగాఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్య భారం పెరుగుతుంది.

**కర్కాటకం :** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో మీకంటే పెద్దవారుకూడా మీ సహకారాన్ని కోర వలసివస్తుంది రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహ కరంగా ఉంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**సింహం :** ఫలితం మాట యెలాగవున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది వ్యాపారం భారీఎత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు శ్రమమీద నెరవేరతాయి ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరుతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో వారం ప్రారంభంలో చికాకులుయేర్పడి తరువాత సర్దుకొంటాయి మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు పోరాటకరలో బాగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో ఆదాయం కంటే అదాపుడి అధికంగా ఉంటుంది. సాహసముతోకూడిన వ్యవహారాల్లో జోక్యంచేసికోవడం తగదు ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లవల్ల మీకు శ్రమ కలుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో మీరే వెనుకకు తగ్గవలసివస్తుంది

స్త్రీలకు— కుటుంబ కార్య క్రమాలకు మార్పులు వస్తాయి పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయిగాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. పోటీవారితో వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు కుటుంబ సంతోషం లభిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు

**ధనుస్సు:** కొన్ని వ్యవహారాల్లో మీరు భవిష్యత్తును ఆలోచించడంవలన ప్రస్తుతం పొందవలసిన లాభాన్ని పొందలేకపోవచ్చును. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసివస్తుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది

స్త్రీలకు— కుటుంబ కార్య క్రమాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది

**మకరం :** వ్యాపారంలో మీకు నష్టం కలిగించడానికి యితరులు చేసే ప్రయత్నాలే మీకు లాభదాయకంగా మారతాయి ఉద్యోగంలో మీ మంచితనమే మీకు యిబ్బందినికలిగిస్తుంది వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ఫలించగలవు సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్య క్రమాలు చురుకుగా సాగుతాయి. కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడంవలన కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. శుభమూలంగా వ్యయం జరుగుతుంది

స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :** వ్యాపారంలో మీకు ముమ్మందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి. అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యంసంతృప్తికరంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీకృషి ఫలించగలదు.

—మహేష్




# వేలంకోసం

డి. కామేశ్వరి

మధ్యాహ్నం మూడు గంటలకి కాఫీ, త్రాగి వీధి వరండాలో వాలు కుర్చీలో పడుక్కుని పేపరు చూస్తున్న నేను ఎదురింటినించి ఒక్కసారిగా వినవచ్చిన ఏడ్పులకి తెల్లబోయాను గతుక్కు మన్నాను ఒక్క క్షణం ఆగి, ఇంకోసారి సరిగా విని ఆ ధ్వని మూర్తి యింటినించే అని దృఢపరచుకుని, వున్నవాళ్ళం వున్నట్టే లేచి, తడబడే అడుగులతో మూర్తి యింటికి బయలు దేరాను

గుమ్మంలో అడుగు పెట్టగానే దృశ్యం చూసి నిశ్చేష్టుడనై పోయాను గోడకి జారబడి పోయి, నేల మీద కూర్చున్న మూర్తి మూసిన కళ్ళనించి నీరు జారుతూంది ప్రక్కనే మూర్తి భార్య రాజేశ్వరమ్మ స్పృహ లేనట్టుగా నేల మీద పడివుంది మూర్తి తల్లి ముసలావిడ పెద్దగా శోకాలు పెడుతూంది "నీకప్పుడే నూరేళ్ళు నిండి పోయాయిరా నాయనా ఎద్దుర్రా అంటే ఆపనికి పోయావుగదరా, నీ చావుకే వచ్చినట్టుంది ఈ యుద్ధరీ, "నాయనా గోపీ" అంటూ ఏడుస్తూంది పురిటికి పుట్టింటికి వచ్చిన మూర్తి ఆఖరి కూతురు ఏడుస్తూనే తల్లిని

పెట్టుకు వోదారుస్తూంది.

అప్పటికే నాకు సంగతి అర్థం అయింది వెంటనే మూర్తి పక్కకి వెళ్ళి "ఏమిటిరా మూర్తీ! ఏమయిందిరా?" గాభరాగా అడిగాను నాగొంతు విని ముసలావిడ గొంతు హెచ్చించింది మూర్తి కళ్ళు తెరిచి బావురు మన్నాడు 'గోపి, గోపిరా' అస్పష్టంగా అంటూ ప్రక్కనే పడివున్న గులాబిరంగు కాగితం అందిం చాడు వణుకుతున్న చేతులతో. టెలిగ్రాం విప్పాను అది ఎయిర్‌ఫోర్సు అధికారుల వద్ద నుండి— 'మీ కుమారుడు పైలట్ ఆ సరు గోపీనాథరావు నిన్నటి యుద్ధంలో మరణించాడని తెల్పుటకు విచారిస్తున్నాం' — గోపీ! గోపి చనిపోయాడా? ఒక్క క్షణం ఏం తోచని దిగ్భ్రమలో ఉండి పోయాను గుండె లవిసేలా ఏడుస్తున్న ఆ తల్లిదండ్రులని ఏమని ఓదార్చాలో కూడా తెలియలేదు నాకు

"ఎంత పని జరిగిందిరా మూర్తీ, యిలా అయిపోతాడని యెన్నడూ అనుకో లేదు, ఎంత దురదృష్టం—యింత చిన్న తనంలోనే వాడికి నూరేళ్ళు నిండి పోతాయని, మిమ్మల్ని యిలా దగాచేస్తా డని' పట్టుకున్న గొంతుతో ఏదో అన్నాను

"గోపీ, గోపీ, యెక్కడున్నావు నాయనా, ఎంత చెప్పానురా, వద్దురా ఈ పని నీకని వినకుండా వెళ్ళి చేతులారా చావుకొని తెచ్చుకున్నావుగదరా, బాబు," మగవాడినని కూడ మరచి గుండెలు పగి లేలా దుఃఖించ సాగాడు మూర్తి

"వూరుకో మూర్తీ, ఎంత ఏడుస్తే మాత్రం పోయినవాడు తిరిగి వస్తాడా? కొంచెం ధైర్యం తెచ్చుకో, నీవే యిలా అయితే ఇంక ఆవిడ సంగతి ఏమిటి? కాస్త గుండె నిబ్బరించుకోవాలి" ఏదో పైకి వోదార్పు మాటలు చెపుతున్నా నాకూ కళ్లనీరు ఆగడం లేదు

"ఇంత పని చేస్తాడని యెన్నడూ అనుకోలేదు, గోపీ!, బాబూ, నాయనా" వాళ్ల దుఃఖానికి అంతం లేదు

"మూర్తీ, ఒకటి చెపుతున్నాను విను నీ కొడుకు దేశంకోసం ప్రాణాలు అర్పిం చాడు అలాంటి ధీరుడిని కన్నందుకు నీవు గర్వించాలి, దేశరక్షణకోసం తన కర్తవ్యం నిర్వహించి, ప్రాణాలు అర్పించిన కొడుకుని చూసి నీవు దుఃఖం మరచి గర్వించాలి" అంతకంటె ఏం చెప్పాలో నాకు అర్థం కాలేదు

"నీ కెలా తెలుస్తుందిరా నాబాధ గుండెలు మండి పోతున్నాయి, కడుపు తీపి బాధ ఇలాంటిమాటలతో తీరుతుందా?"

"అవుననుకో, నాకు తెలుసు, నీబాధ అయినా కొంచెం వోదార్పు చెంపాలి, అంతకన్న చేయగలిగింది ఏముంది?"

మూర్తి భార్య రాజేశ్వరమ్మ ఇంత సేపటికి కళ్ళు తెరచింది ఆ శోక మూర్తిని, ఆ తల్లిని చూస్తూంటే గుండెలు ద్రవించాయి 'బాబూ, గోపీ, నాయనా ఎక్కడవున్నావు? ఎక్కడకు వెళ్లి పోయావు నన్నొదిలి—ఒక్కసారి కనిపించు నాయనా? ఎంత బ్రతిమిలాడానురా నాయనా, నీకీ ఉద్యోగం వద్దని వినకుండా వెళ్లి నన్నిలా అన్యాయం చేసి వెళ్లి పోయావా? . గోపీ" సంస్కారం అడ్డు రాగా పెద్దగా ఏడ్వలేక కొంగు నోట్లో కుక్కుకుని కుళ్లి కుళ్లి ఏడ్వసాగింది

"వూరుకో అమ్మా, వూరుకో, మీకూ వాడికి ఋణం చెల్లిపోయింది అంతే! ఇంక గుండె రాయి చేసుకోవాలి మీరు"

ముసలమ్మగారి శోకాలకి ఇరుగు పొరుగు చేరి ఎవరికి తోచిన విధంగా వారు వోదార్చ సాగారు ఎన్ని విధాల వోదారుస్తే ఎన్ని స్వాంత వచనాలు చెపితే మాత్రం తీరేదా ఆబాధ! ఉత్తి మాటలతో తీరు తుందా గర్భశోకం!

బాధ్యతలు, బరువులు అన్నీ తీర్చుకు నిశ్చింతగా వుండవలసిన ఈ వృధాప్యంతో ఇంతటి కష్టం రావడం మూర్తి దుర దృష్టం! రోజుకి ఎన్నివందలమంది తల్లి దండ్రులు యీ విధంగా విలపి స్తున్నారో!

* * *

గోపి చనిపోయాడన్న సత్యం నా మన సుని పిండసాగింది పట్టుమని ఇరవై రెండేళ్ళు లేని గోపికి ఆయుష్షు అప్పుడే తీరిపోవడం ఎంత దౌర్భాగ్యం! గోపి ! గోపిని చిన్న తనం నుంచి ఎరుగుదును నేను పొట్టి నిక్కర్సు, ఏదిబడి చదువు, పంట్లాలు, కాలేజి చదువు, ఎయిర్‌ఫోర్సులో చేరడం అన్నీ ఎరుగుదును నేను

రామమూర్తి నాకు గాఢమిత్రుడే గాక, ఇద్దరికీ యెక్కడో దూరపు బంధుత్వం కూడ వుంది. ఇద్దరం ఒక వూర్లో పుట్టి పెరిగి, ఇంటర్ మీడియట్ వరకు సహ పాఠకులం ఇంటర్ తర్వాత మూర్తి ఇంజనీరింగుకు వెడితే, నేను బియస్సీ, ఎమ్. ఎస్సీ చదివి, మూర్తి సూపర్నెంట్ ఇంజనీరుగా, నేను కాలేజి ప్రిన్సిపాల్‌గా రిటైరై, మళ్లీ ఇద్దరం ఒకే వూళ్లో, ఎదురెదురుగా ఇళ్ళు కట్టుకుని స్థిర పడ్డాం మూర్తి పిల్లలందరూ పెద్ద వాళ్లయి పోయారు ఆడ పిల్లలందరికి పెద్ద సంబంధాలు చేశాడు పెద్ద కొడుకు చదువు తప్ప ఇంకో ధ్యాసలేకుండా బుద్ధిగా చదువుకుని, ఇంజనీరింగ్ చదివి పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు

ఎటొచ్చి మూర్తికి ఎప్పుడూ రెండో కొడుకు గోపి గురించే బెంగ! చిట్టచివర మూర్తికి వయసు మళ్లాక పుట్టిన గోపి గురించే వూరికే బాధపడేవాడు

గోపిది చిన్నప్పటి నించి వింత స్వభా వమే! కోపం, పంతం తొందరపాటు అన్నీ ఒక పాలు యెక్కువే! ఎన్నిదెబ్బలు తిన్నా అన్న మాట మీదే నిలబడేవాడు తన మాటే నెగ్గాలనే వాడు

చిన్నప్పటి నించి గోపికి చదువుమీద కంటె ఆటపాటల మీద, మెకానిజం మీద ఇంటరెస్టు మాపేవాడు బొత్తిగా చదువు మీద ధ్యాసలేకుండా వుండేవాడు ఇంట్లో ఎప్పుడూ ఏ స్క్రూడ్రైవర్ పట్టుకుని ఆ స్విచ్‌లు మార్చి ఇంకోటి బిగించడం, ప్లగ్గులు ఒకదాని దొకటి మారుస్తూ వుండడం, రేడియో విప్పి ఆ వైర్లు తనిఖీ చేయడం ఫేను విప్పి ఆయిలింగ్ చేస్తూండడం, ఏ ఇస్త్రీ పెట్టో, హీటరో బాగు చేయడం ఇలాంటి పనే చేస్తూండేవాడు వాళ్ళ నాన్న లేనప్పుడల్లా కారు ఎక్కి ఆవైర్లూ బేటరీలు అవి ఎలా పనిచేస్తున్నాయో చూడడం, అన్నీ విప్పి చివాట్లు తినేవాడు. పట్టుమని పదిహేనేళ్ళు లేకుండానే కారు డ్రైవింగ్ నేర్చుకున్నాడు ఇంక గేమ్సు, అందులో క్రికెట్ అంటే విపరీత మైన పిచ్చి క్లాసులు ఎగగొట్టి కూడ మేచ్‌లు ఆడుతూండేవాడు సరే ఈ కాలపు అందరి పిల్లల్లాగా సినిమాల పిచ్చి,

రోజుకో మడత నలగని బట్టల కోసం యింట్లో వేధించడం అంతా సరేసరి.

గోపీని గురించి అస్తమానూ నా దగ్గిర వాపోయేవాడు మూర్తి. "ఏమి టోరా, వీడికి బొత్తిగా చదువు మీద ధ్యాసేలేదు, ఎలా పైకి వస్తాడో! వీడి వరస చూస్తుంటే బాగుపడే లక్షణాలు కన్పడడంలేదు, ఎంత చెప్పినా, ఎన్ని విధాల చెప్పినా వాడి కర్థం కావడంలేదు. ఏం చేయాలో బోధపడడం లేదు" అంటూ ఒకటే బాధ పడేవాడు

"ఆ. ఇంకా కుర్రతనం నాలుగు రోజులు పోతే వాడే తెలుసుకుంటాడు పోనీ వాడి కిష్టమైన త్రోవనే వెళ్ళనిద్దాం, ఏ మెకానికల్ ఇంజనీరింగో చదివించవచ్చు" అని ఏదో సర్దిచెప్పే వాడిని

"ఆ వీడి మొహం, ఇంజనీరింగ్ కూడ చదువుతాడా వీడు, అంతవరకైనా వెళ్ళాలిగదా, వీడి చదువు వరస యిలా వుంటే, ఏం పెద్ద చదువులు చదువుతాడు" నిస్పృహగా అనేవాడు మూర్తి

ఆఖరికి అందరం అనుకున్నట్టుగానే మెట్రిక్ రెండవసారి తప్పి, ఇంటర్ బొటా బొటి మార్కులతో ప్యాసు అయానని పించుకుని, బి యస్సీ రెండో సంవత్సరం పరిక్ష పోగానే ఇంక చదవనంటూ ఇంటికి వచ్చేశాడు గోపి అందరూ ఎన్నివిధాలు గానో చెప్పారు. తల్లి బ్రతిమిలాడింది తండ్రి కేకలు వేసి తిట్టాడు. అయినా ఇంక చదవనని మొండికెత్తాడు తనకి చదువుమీద ఇంటరెస్టు లేదని, ఎంత చదివినా తనకు రాదని, ఇష్టంలేని చదువులు చదివి ప్యాసుకాలేనని, తనకి ఎయిర్ ఫోర్సులో చేరాలని సరదాగా వుందని, దానికి ఈ చదువు చాలని అన్నాడు తల్లి 'అది ప్రమాదమైన ఉద్యోగమని' వద్దని బ్రతిమిలాడింది మూర్తి "చదవక పోతే నీ ఖర్మ! ముప్పెస్తో! నీచదువుకి గుమాస్తా ఉద్యోగం తప్ప యింకేదిరాదు నీ యిష్టం, ఆలోచించుకో" అని చీవాట్లు, పెట్టాడు 'ఎంతమంది ఎన్ని విధాల చెప్పినా వినలేదు

ఆ రోజు మధ్యాహ్నం చేతిలో పేపరు పట్టుకుని గోపి నాదగ్గరకి వచ్చాడు, 'మీరేనా చెప్పండి బాబాయి' అంటూ ఏమిటన్నట్టు ప్రశ్నార్థకంగా చూశానునేను.

# దేశంకోసం

'అదే చూడండి బాబాయి, నాకీ చదువు ఇష్టంలేదు అంటే ఇదే చదవ మంటారు నాన్నవాళ్ళు.....'

"చదవక పోతే ఏంచేస్తావు గోపీ!? పెద్ద చదువులు చదవకపోతే పెద్ద ఉద్యోగాలు ఎలావస్తాయి?....

"అదికాదు, ఇంటరెస్టు లేనిది, బల వంతంగా చేయిస్తే మాత్రం వస్తుందా నాకు ఎయిర్ ఫోర్సులో చేరాలని ఎంతో సరదాగా వుంది దాని కయితే ఈ చదువు చాలు, హాయిగా బోలెడు జీతం, లైఫ్ ఎన్‌జాయ్ చేయవచ్చు నే నెలాగూ పెద్ద చదువులు చదువలేను, పెద్ద ఉద్యోగాలు చేయలేను, దీన్లో అయితే ఈ చదువు తోనే చాలపైకి వెళ్ళి పెద్ద ఆఫీసర్ని అవగలను!" ఉత్సాహంగా చెప్పుకు పోసాగాడు గోపి

"కాని, ఎలాగైనా రిస్కు జాస్తేనోయి! అమ్మ, నాన్న భయపడ్డం సహజమేగదా," గోపి చిరాగ్గా నుదురు చిట్లించాడు "మీరూ అలాగే అంటారేమిటి బాబాయ్, ఎంత మంది ఎయిర్‌ఫోర్సు, ఉద్యోగాలుకి వెళ్ళడం లేదు ఎంత మంది పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తూ దర్జాగా లేరు ఎయిర్ ఫోర్సులో జాయిన్ అయినంత మాత్రాన వెళ్ళిన వాళ్ళందరూ చచ్చిపోతారా? మనకి ఆయుష్షు తిన్నగా వుంటే ఎక్కడుంటే మాత్రం ఏం? అందరూ ఇలాగే అనుకుంటే యింక ఆ ఉద్యోగాలు చేసే దెవరు? నాన్న ఇన్ని వేదాంత గ్రంధాలు చదువుతారు, లమ్మ భగవద్గీత వల్లిస్తుంది రోజూ, 'మనిషికి చావు అన్నది ఒకసారే గాని ఇన్నిసార్లు రాదుగదా, ఆ చావు ఎక్కడున్నా వెంటాడుతుంద'న్న సత్యం మీ కందరికీ తెలిసే ఇలా అనవసరంగా ఎందుకు భయపడతారో నా కర్థంకాదు" గోపి ఆవేశంగా అన్నాడు

నేను ఆశ్చర్యంగా గోపి వైపు చూశాను గోపికి యిన్ని తెలుసా? ఆశ్చర్యానందాలతో ప్రసంశాపూర్వకంగా చూశాను ఎంత చక్కగా చెప్పాడు!

"ఏం కాదా బాబాయ్, నేను చెప్పింది నిజం కాదా? నాకు బ్రతికే యోగంవుంటే, ఆయుష్షు తిన్నగా వుంటే, విమానాల్లో ప్రయాణం చేసినంత మాత్రాన చచ్చిపోతానా? ఇంకో ఉద్యోగంలో వుంటే ఆ చావురాదా? హాయిగా పెద్ద జీతాలో జల్సాగా బ్రతకవచ్చు బ్రతికినన్నాళ్ళు... చచ్చిపోతే ఏబాధ లేదు.. నా కెందుకో చాల సరదాగా వుంది ఎయిర్‌ఫోర్సులో చేరాలని, అమ్మ, నాన్న ఎంత మాత్రం వీల్లేదంటున్నారు, మీరేనా నచ్చచెప్పండి బాబాయ్."

"నిజమే గోపీ, చావు అన్నది యెక్కడున్నా, ఎవరూ తప్పించుకోలేరన్న సత్యం అందరికీ తెలిసిందే అయినా, వీలయినంత వరకు మృత్యుపరిసరాలకి దూరంగా వుండాలని అందరూ ఆదుర్దా పడ్డం సహజమేగదా! పోనీ నీ కెందుకు యింత పట్టుదల, అమ్మ నాన్నలని అనవసరంగా నొప్పించడం యెందుకు, చక్కగా మీ అన్నయ్య లాగా నీవు ఏ ఇంజనీరింగుకో వెళ్ళి బుద్ధిగా చదువుకో కూడదా?.

"నాకీ చదువు వంట పట్టదని ఎన్ని మార్లు చెప్పినా మీరెవరూ ఎందుకు వినరు? మీరూ ఇలాగంటారని అనుకో లేదు, నాన్నకి నచ్చచెప్తారన్న ఆశతో వచ్చాను" నిస్పృహగా అన్నాడు గోపి

నాకు జాలి వేసింది అంత ఉత్సాహంతో ఉన్నవాడిని నిరుత్సాహపరచడం భావ్యం కాదని పించింది పోనీ దీన్లో అయినా పైకి వస్తాడేమో అనిపించింది

"అలాగే, మీ నాన్నకి చెప్తాగాని, ఎయిర్ ఫోర్సు సెలక్షన్ కూడ కష్టమే అనుకుంటాను, దానికి రిటెన్ టెస్టు, సెలక్షన్, ట్రైనింగ్ అన్ని వుంటాయి, నీవు నెగ్గగలవా?"

"హో, అదెంత," ఉత్సాహంగా అంటూ పేపరు తెరిచాడు గోపి ఇదిగో చూడండి పర్మనెంట్ రిక్రూట్ మెంట్ గురించి అడ్వర్టైజు చేశారు, వాళ్ళడిగినవన్ని నాకు సరిపోతాయి" అంటూ చూపించాడు.

మొత్తానికి ఎలాగైతేనేం అనుకున్నది సాదించాడు గోపి నా బోధవల్ల, నేను ధైర్యం చెప్పడం వల్లనైతేనేం, గోపి మొండి పట్టుదలవల్ల నైతేనేం, కొడుకు ఎలాగూ పెద్ద చదువులు చదివే సూచనలు లేవు, ఈ విధంగా నైనా పైకివస్తాడేమో అన్న ఆశ వల్ల నైతేనేం సగం అయిష్టం తోనే గోపి ఎయిర్‌ఫోర్సులో చేరడానికి ఒప్పుకున్నాడు మూర్తి

అసలు మూర్తి వాళ్ళ ఉద్దేశం 'ఆ

# దేశంకోసం

పీడి మొహం, వీడెలాగూ సెలక్టు అవడు. వాళ్ళే పనికిరారు పొమ్మంటే అప్పుడే మానుకుంటాడు ' అని భావించాము. అదీ కాక మూర్తికి విపరీతమైన నమ్మకం జాతకాలంటే! కొడుకు ఆయుష్షుకి అరవై ఏళ్ళలోపల ఏఢోకా లేదని, భయపడవలసిన అవసరం లేదని నచ్చచెప్పు కున్నాడు.

అందరం అనుకున్నట్టుగాక, గోపి రిటెన్ టెస్ట్లో ఫస్టున వచ్చి, మంచి రేంకుతో సెలక్టు అయ్యాడు. అప్పుడు కూడ వాళ్ళమ్మ ఏడ్చి, వాళ్ళనాన్న వద్దని బతిమిలాడినా, ఇంక వింటాడా గోపి?

చూస్తుండగానే ఏడాది ట్రైనింగ్ పూర్తిచేసి, పైలట్ ఆఫీసరుఅయి, జెట్, హంటర్ల ట్రైనింగ్ కోరుకుని, ఇంగ్లండు వెళ్ళాడు గోపి! అప్పుడు మూర్తి భయపడి 'జెట్ ట్రైనింగ్ ఎందుకు కోరావు. అది యింకా ప్రమాదమైనది గదా' అని రాస్తే 'దీన్లో అయితే ఇంకా తొందరగా పైకి రావచ్చు. జీతాలు కూడ ఎక్కువ' అని రాశాడు గోపి. గోపికి ఎంతసేపూ ఎంత ఎక్కువ సంపాదిస్తే అంత జల్సాగా ఖర్చు పెట్టుకోవచ్చన్న ఉద్దేశమే!

ఆరునెలలు ఇంగ్లండులో ట్రైనింగ్ పూర్తి చేసుకుని, ఇరవైరోజుల సెలవుమీద ఇంటికి వచ్చిన గోపిని చూసి అందరం ఎంతో ఆనందించాం. ఈ ఏణ్ణార్ధంలో, గోపిలో చాలా మార్పు వచ్చింది. బాగా పొడుగయి, వళ్ళు వచ్చి, రంగు వచ్చి నిండుగా వున్నాడు. డ్రస్సు వేసుకుంటే పెద్ద ఆఫీసరులా దర్జాగా వున్నాడు. పూర్వపు బాల్య చేష్టలు, అమాయకత్వం, అల్లరితనం పోయి హుందాతనం, మాట మన్నన, మర్యాద అన్ని వచ్చాయి. రోజుకో డ్రస్సు వేసుకొని, సూటు బూటుతో చకచక యింగ్లీషు మాట్లాడే గోపినిచూసి మూర్తివాళ్ళు పొంగిపోయారు. కొడుకు ప్రయోజకుడైనందుకు ఆనందించారు.

గోపిని చూసి వాళ్ళమ్మ సంతోషించినా 'అసలే తొందర మనిషి, వెనకాముందు చూసుకోడు. ఎప్పుడేం చేసా డో' అని బెంగ పెట్టుకుంటూ వాటాడితే గోపి హేళనగా నవ్వి త్రోసి పారేసేవాడు. "అందరూ నన్నో చాతకాని వాడి క్రింద జమ కడ్తారుగాని, నా అధికారులు, కొలీగ్, అందరూ నన్నూ, నా ఎఫిసెన్సీని ఎంతమెచ్చుకుంటారో తెలుసా! 'సిలాంటివాళ్ళే ఎయిర్ ఫోర్సుకి కావాలి అంటూ నా ధైర్యసాహసాల్ని పొగుడుతారు' అంటూ ఇంగ్లండులోనూ ఇండియాలోనూ పై అధికారులు ఇచ్చిన యోగ్యతాపత్రాలు చూపించాడు.

'గోపి యీజ్ వన్ ఆఫ్‌ది ఎఫిసెంట్ పైలెట్స్' అన్నసర్టిఫికేట్లు చూపాడు. గోపి యింత ప్రయోజకుడైనందుకు ఎంతో ఆనందించాం అందరం.

గోపిని చూశాక 'ఒక్కొక్కరికి ఒక్కొక్క లైనులో ప్రవీణ్యత, ఇంటరెస్టు వుంటుంది. మనంఅది గుర్తించి మనం వాళ్ళని ఆతోవనే వెళ్ళటానికి ప్రోత్సహిస్తే ఎంతవారేనా అవుతారనిపించింది.

* * *

గోపి యిరవై రోజులు శలవ గడిపి డ్యూటీలో జాయిన్ అయిన నెలరోజుల కూడ కాకముందే పిడుగులాంటి వార్త— పాకీస్తాన్‌తో యుద్ధం! ఆ వెంటనే గోపి నించి ఉత్తరం! తనని ఫ్రంట్‌కి పంపిస్తున్నారని, రేపే బయలుదేరి వెళ్ళాలని, తన కోసం భయపడవద్దని, ఆదుర్దా పడవద్దని నాలుగు లైన్లు రాశాడు ఇంటికి.

అది చూసి మూర్తి వాళ్ళు చాల ఆదుర్దాపడ్డాడు. అనుక్షణం ఎలాంటి వార్త వినవలసి వస్తుందోనన్న చింతతో గడిపేవారు. రోజుకి ఎన్ని విమానాలు కూలిపోతున్నదీ, ఎంతమంది చనిపోతున్నదీ విని బెంగతో సతమతమయ్యేవారు. 'అసలే తొందర మనిషి, మొండి ధైర్యం, ఏంచేస్తాడో' అని నా దగ్గిర వాపోయేవాడు మూర్తి.

'మరేం ఫరవాలేదు, గోపికి చాకచక్యం ధైర్యం అన్ని వున్నాయి.' అని ధైర్యం చెప్పినా, నాకూ, గోపి ఏ ముహూర్తాన ఈ ఉద్యోగంలో చేరేడోకాని, ఈ యుద్ధం కూడ యిప్పుడే రావాలా' అని బాధపడేవాడిని.

గోపి ఫ్రంట్‌కి వెళ్ళిన వారంరోజులకి

ని ఉత్తరం వచ్చింది. అతని తల్లికి ఎంత చక్కగా రాశాడో! నాకు చూపించి గర్వంతో పొంగిపోయాడు మూర్తి.

'అమ్మా,

నేను క్షేమంగా వున్నాను. నా గురించి మీరేం భయపడకండి. నాకే ప్రమాదం జరగదు. క్షేమంగా, విజయంతో తిరిగి వస్తాను. మీరనవసరంగా దిగులుపడకండి.

అమ్మా, నిజంగా నాకెంత ఆనందంగా వుందో తెలుసా యిప్పుడు! ఈనాటికి నేనూ దేశానికి ఏ కొంచెమైనా ఉపయోగపడుతున్నందుకు—నాకు ఎంతో తృప్తిగా వుంది. చూశారా మీరు అప్రయోజకు డనుకునే మీ కొడుకు ఈనాటికి ప్రయోజకుడై దేశాన్ని సేవచేస్తున్నాడు.

అమ్మా, దేశరక్షణకి తోడ్పడడంలో దేశంకోసం ప్రాణాలు త్యాగం చేయడంలో యింతటి అనిర్వచనీయమైన ఆనందం వుందని నేనెన్నడూ లనుకోలేదు సుమా! మేమందరం!, అంటే నేనూ, నా సహోద్యోగులు ఎంతో ధైర్యసాహసాలతో పోరాడుతున్నాం శత్రువులతో! మాలో ఏ ఒకరికీ ప్రాణభయం లీలా మాత్రంగానైనా కలుగక పోవడం మాకే ఆశ్చర్యంగా వుంటుంది.

ప్రతి ఒక్కరం ఫ్లైట్‌కి వెళ్లేముందు ఎంతో ఉత్సాహంతో ఒక్కొక్కరం ఎన్నేసి శత్రు విమానాలు కూల్చగలమా, శత్రువుకి ఎంత నష్టం కలిగించగలమా అన్న ఆలోచన తప్ప, మాకేమైనా ఆపదవస్తుందేమో నన్న అనుమానమేలేదు. ఏ క్రికెట్ ఆటో ఆడుతున్నంత ఉత్సాహంగా ఒక్కొక్కరం ఎన్నేసి వికట్లు పడగొట్టగలమా అన్నట్టుగా ఒకొక్కరం పంతాలువేసుకుని మరీ రణరంగంలోకి దుముకుతున్నాం. ఒకవేళ కర్తవ్య నిర్వహణలో మాలో ఎవరికైనా ఆపద సంభవించినా, మరణం సంభవించినా, తాత్కాలికంగా తోటి ఉద్యోగిని పోగొట్టుకున్నందుకు బాధపడ్డా, దేశం పట్ల తమ కర్తవ్యం నిర్వహించి, వీరోచితంగా పోరాడి ప్రాణత్యాగం చేసిన, ఆ ధీరుని అడుగుజాడల్లో మేము నడవాలని నిశ్చయించుకుని నూతనోత్సాహంతో శత్రువులని చీల్చి చెండాడాలన్న ఆవేశంతో వీర విహారం చేస్తున్నాం.

మేమందరం దేశంకోసం ప్రాణత్యాగం చేయటానికి సిద్ధంగావున్నాం. విజయానికి మా శక్తివంచనలేకుండా తోడ్పడుతున్నాం. అంతిమ విజయం మనదే అన్న ధైర్యం మాకుంది.

అమ్మా నేను రెండు శత్రు విమానాలని ధ్వంసం చేశాను తెలుసా! ప్రపంచ ఖ్యాతి గాంచిన శాబర్ జెట్ విమానాలని, మనభారత దేశంలో తయారయిన విమానాలతో ఒక్కొక్కటి ఒక్కొక్క దెబ్బకి నేలకూల్చాను. ఎయిర్ మార్షల్ నాతో కరచాలనం చేసి వెల్‌డన్ బాయ్'— అని ప్రసంశించారు. డిఫెన్సు మినిష్టర్ నా భుజం తట్టి ఆప్యాయంగా ప్రశంసించి అప్పటికప్పుడే 'మహా వీర చక్ర' బిరుదు ప్రసాదించబోయేటట్టు తెలిపారు. ఆనందంతో నావళ్లు పులకరించింది. కళ్లు చెమర్చాయి. ఇలాంటి దేశం కోసం ప్రాణాలు అర్పిస్తే మాత్రం ఏమని పించింది? నా ఆనందంతో పాలుపంచుకోడానికి మీకు రాస్తున్నాను ఈనాటికి నాజన్మ తరించినట్టనిపించింది.

అమ్మా, కర్తవ్య నిర్వహణలో, ఒకవేళ నాకేదయినా సంభవిస్తే మీరెంతమాత్రం విచారించకూడదు దేశంకోసం ప్రాణాలు అర్పించిన కొడుకుని చూసి మీరు గర్వించాలి!

రెండు విమానాలు కూల్చినందుకు నాకివాళ ఆఫ్. మళ్లీ యింకో ఫ్లైట్‌కి రేపో, ఎల్లుండో వెడతాను. వీలయినంత వరకు శత్రువుకి నష్టం కలిగించాలన్న ఆరాటం నాలో చాల ఎక్కువగా వుంది. నా శక్తివంచన లేకుండా విజయానికి తోడ్పాటు పడుతాను.

ఇవాళ తీరికగా నా ఆనందాన్ని వెల్లడించుకోవాలని మీకీ ఉత్తరం రాశాను. చాల పెద్ద ఉత్తరం రాశాను గదూ! మళ్లీ తర్వాత ఇంకో ఉత్తరం రాస్తాను. ఇంక వుంటాను జైహింద్!''—గోపి.

ఆ ఉత్తరం చూసి గోపి ధైర్యసాహాలకి అంతటి ఘనకార్యం చేసినందుకు ఆనందించాం.

ఆ ఆనందపారవశ్యం అణగకముందే తర వాత మూడురోజులకే యింతటి ఘోరవార్త వినవలసి వస్తుందని కూడ అనుకోలేదు.

గోపిలాంటి ధీరుడు చనిపోవడం ఎంత దురదృష్టం! ఎంతమంది తల్లిదండ్రుల కడుపులో చిచ్చుపెట్టడానికి, ఎంతమంది భార్యబిడ్డలు కన్నీరు కార్చడానికి వచ్చిందో ఈయుద్ధం! ఎని రక పాతాలు జరగాలో ఎంతమంది తమ ప్రాణాలు బలిపెటాలో!

మూర్తి యింటినించి అప్పుడప్పుడు



...దయావిహీనంగా ఏడుపులు విని ...మన్నాయి యింకా! విన్ని వేలమంది ఇలా దుఃఖిస్తున్నారో!

* * *

మర్నాటి పేపరులో గోపి మరణ వార్త విశదంగా తెలిసింది. ఆరోజు ఫ్లైటుకి వెళ్ళి ఒక శత్రు విమానానికి నష్టం కలిగించి తిరిగి బేస్‌కి వస్తూ ఉండగా ఇంకో శత్రు విమానం కురిపించిన బాంబులకి గోపి ప్లేన్ దగ్ధమై కూలిపోయిందట. ప్లేనుతోపాటు గోపి కూడ మంటలకి ఆహుతి అయిపోయి నట్టు, అతని ధైర్యసాహసాలకి మెచ్చి ప్రభుత్వం 'మహావీరచక్ర' బిరుదు ప్రసాదించి నట్టు వార్త వచ్చింది.

అది చూసి మూర్తి వాళ్ళు గొల్లుమని ఏడ్చారు. పాపం ఆఖరికి శవాన్నయినా కళ్ళ చూసే యోగ్యం లేకపోయింది. 'నీవులేని నీయీ బిరుదులు ఎందుకు నాయనా, ఏం చేసుకోం? గోపీ గోపీ' అంటూ గుండెలు పగిలేలా రోదిస్తుంటే వాళ్ళని చూసి రాళ్ళు పయితం కరుగక మానవు.

ఇంటి నిండా కూతుళ్ళు, అల్లుళ్ళు ఆప్తులు, బంధుజనం, అంతమందిలో గోపి లేని వెలితి, ఇంక పూడలేని వెలితి అని మరింత బాధపడేవారు.

— చూస్తుండగానే పన్నెండు రోజులు గడిచిపోయాయి. పన్నెండో రోజున వూరి పెద్దలందరూ, మూర్తి అధ్వర్యాన వూళ్ళో సంతాప సభ ఏర్పాటు చేశారు. సభలో గోపిలాంటి ధీరుడు తమ వూరి వాడు కావడం తమకు గర్వకారణం అన్నారు. దేశంకోసం ప్రాణాలర్పించిన, అంతటి ధీరుడుని కన్న ఆ తల్లి దండ్రులు ధన్యులన్నారు. అందరూ గోపిని, గోపి ధైర్య సాహసాలని ప్రశంసించారు. గోపి ఫోటో ఒకటి ఆవిష్కరించి, పూలమాలలు వేసి వూరంతా ఆర్బాటంగా వూరేగించారు. గోపి తల్లి, తండ్రులకి తమ సంతాపాన్ని తెలిపారు. — అదంతా చూస్తూంటే మనిషికి బ్రతికి వున్నప్పటికంటె, చని పోయేకే ఎక్కువ విలువ, ఎక్కువకీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయన్న సత్యం కళ్ళారా చూసాను. ఒకప్పుడు తలిదండ్రులు పయితం ఎందుకూ పనికిరాడనుకున్న

# దేశంకోసం

ఆ గోపినే, ఈ వాడు ఇంత మందిచేత ఇన్ని ప్రశంసలు అందుకుంటున్నాడని పించింది.

రోజులు దొర్లిపోతున్నాయి. ఆఖరికి యుద్ధ మాగిందన్న వార్త అందరికి శాంతి కలిగించింది. రక్తపాతాలు ఆగినందుకు అందరూ ఆనందించారు.

గోపి పోయి రెండునెలలు అవుతూంది. ఈ రెండు నెలలలోనూ మూర్తి దంపతులలో ఎంతో మార్పు వచ్చింది. జీవచ్ఛవాలలాగా, దైన్యంగా బ్రతుకక తప్పదన్న వైరాగ్య ధోరణిలో రోజులు జరుపుతున్న, వాళ్ళని, వాళ్ళ దుఃఖాన్ని కాలగతే మార్చాలి!

* * *

యుద్ధంలో అమిత ధైర్య సాహసాల చూపి ప్రాణాలు అర్పించిన వారికి, యుద్ధంలో వీరకృత్యాలు చేసినవారికి ప్రభుత్వం వారి ధైర్య సాహసాలను గుర్తించి బిరుదులు ఇచ్చి సత్కరించడాకి నిశ్చయించుకుంది. ఆ బిరుదులను అందుకోడానికి రావలసినదని అందరికి ఆహ్వానాలు వెళ్ళాయి. మూర్తికి కూడ 'చనిపోయిన తమ కుమారుని తరుపున 'మహావీరచక్ర' బిరుదును అందుకోడానికి ఢిల్లీ రావలసిన దని ఆహ్వానం పంపింది ప్రభుత్వం.

అది చూసి మూర్తి పేలవంగా, విషాదంగా నవ్వాడు. "నాకెందుకురా, వాడు లేని యీ బిరుదులు, గౌరవాలు నాకెందుకు, ఏం చేసుకోను, ఫొటోకట్టించుకోనా? అది చూస్తున్నప్పుడల్లా మరింత బాధ, నాకక్కర లేదు, నేవెళ్ళను" అన్నాడు.

"ఇంతటి గౌరవం పొందగలగడం సామాన్యంకాదు. అందరికి ఇంత అదృష్టం లభించదు. నీ కొడుకు లేకపోయినా వాడికి లబించిన కీర్తి ప్రతిష్ఠలు నీవికావా? నీవు అలాంటి కొడుకుని కన్నందుకు గర్వించాలి. తప్పకుండా నీవు ఢిల్లీ వెళ్ళవలసిందే..." అని ఎంతో నచ్చచెప్పి, బలవంతంగానే ఢిల్లీ పంపించాను.

వారం రోజుల తర్వాత ఢిల్లీనించి వచ్చిన మూర్తిని చూసి ఆశ్చర్యపోయాను. మూర్తిలో విపరీతమైన మార్పువచ్చింది. పూర్వపు విచారపు దుఃఖపు ఛాయలు మచ్చుకైనా కనపడలేదు. వాటిస్థానే మోహంలో కాంతి, కళ్ళలో తేజస్సు, అన్నింటికి మించిన ఏదో అవ్యక్తమైన ధృఢత్వం కన్పించింది, మాటలలో, చేతలలో, రూపులో! నే నాశ్చర్యపడి అడిగే లోపలే తనే ఎంతో ఉత్తేజితుడై చెప్పడం మొదలు పెట్టాడు.

నేను నిజంగా ఢిల్లీ వెళ్ళడం చాలా మంచి పని అయింది సుమా, వెళ్ళక పోయుంటే, ఎన్నాళ్ళకీ మామూలు మనిషిని కాలేకపోయేవాడిని. అక్కడికి వెళ్ళి, నాలాంటి వారిని చాలా మందిని చూశాక నాకు జరిగిన నష్టం. స్వల్పమే అనిపించి, ఏదో వూరట కల్గింది. ఉన్న ఒక్కగానొక్క కొడుకుని పోగొట్టుకున్నపండు వృద్ధ మాతలను, ఏకైక పుత్రుని దేశానికి అర్పించిన తండ్రులని, పెళ్ళయిన కొద్దిరోజులలోనే భర్తలను కోల్పోయిన అభాగినులను, తండ్రి ప్రేమ కరువయిన పసిపాపలు గల తల్లులను... వీరందరిని చూస్తూంటే నేనింకా కొంతలో కొంత అదృష్టవంతుడనే అనిపించింది.

అందులో ఒక పండు ముసలి, ఎనభై ఏళ్ళ ఎక్స్ సర్వీస్‌మేన్—ఇది వరకు ఒక కొడుకు చైనాయుద్ధంలో చనిపోయాడట. ఇప్పుడు మిగిలిన ఆ ఒక్క కొడుకు కూడ చనిపోయినా కూడ ఎంతో నిబ్బరంగా "నాకు దక్కని అదృష్టం నా కుమారులకు దక్కినందుకు గర్విస్తున్నాను. దేశంకోసం ఏ కొంచెం సేవచేయగలిగినందుకు గర్విస్తున్నా నన్నాడు" అతని దేశభక్తికి, గుండె నిబ్బరానికి అందరూ జోహారు లర్పించారు.

ఇంకో కెప్టెన్ భార్య, పాపం వివాహమైన ఆరు నెలకే భర్తని పోగొట్టుకున్న అభాగ్యురాలు, భర్త తరపున 'వీర

చక్ర' బిరుదును అందుకోడానికి వచ్చి 'తనకు కలిగిన వ్యక్తిగత నష్టం ఎంత బాధాకరమైన దైనా, ఎవరూ పూడ్చలేని దైనా, అంత ధీరుడిని భర్తగా అరు వెలలైనా పొందగలిగి నందుకు, దేశంకోసం ప్రాణాలర్పించిన వీరుడి భార్యనని చెప్పకో డానికి గర్విస్తున్నానని' కన్నీళ్లతో పత్రికా విలేఖరులతో చెప్తున్న ఆమెని చూసిన అందరి హృదయాలు ద్రవించాయి.

ఇంకో వృద్ధ మాత, ఏకైక ఆధార మైన కొడుకుని వృద్ధాప్యంలో పోగొట్టు కుని ఏకాకి అయి కూడ 'పుత్రమరణం తనని ఎంత దహిస్తున్నప్పటికీ, గర్భశోకం [illegible] కుంగ దీస్తున్నప్పటికీ, ఒక మంచి కార్యంకోసం, దేశంకోసం, దేశ రక్షణకోసం తన పుత్రుని అర్పించినందుకు ఆనందిస్తున్నానని, వీరమాత అనిపించు కున్నందుకు, గర్విస్తున్నానని, అటువంటి పుత్రుని గన్న తన జన్మ ధన్యమైనదని భావిస్తున్నానని' చెప్పింది కుమారుని తరఫున 'మహావీరచక్ర' బిరుదు అందు కోడానికి వచ్చింది

ఇంకో మేజర్ భార్య నలుగురు పసి పాపల తల్లి 'తన భర్త మరణం తనకి వ్యక్తిగతంగా ఎంత కష్టం కలిగించినా, ఎంత క్రుంగ దీస్తున్నా భర్త అడుగు జాడల్లో, భర్త ఆశయాలకు అను గుణంగా, ఈ పసిపాపలను పెంచి పెద్ద చేసి, వీరులుగా దేశసేవకి వినియో గించడం తన లక్ష్యం' అంది

ఇలాగే ప్రతి ఒక్కరూ, బహుమతిని అందుకోడానికి వచ్చిన అందరూ, తమ తమ వ్యక్తిగత నష్టాలకి విచారిస్తున్నా దేశంకోసం తన వారిని అర్పిస్తున్నట్లు మాట్లాడారు ఇంకా వీరు తెరమీద వర మాత్రమేనని, తెరవెనక ఇలాంటి వారు వేల మంది వున్నారన్న నిజం గుర్తించి, ఒక్క నేనే అంత ధీరుడైన కొడుకుని కని కూడ ఇంత బేలగా దుఃఖిస్తున్నానని పించింది.

రాష్ట్రపతినించి బహుమతి అందు కుంటూంటే చేతులు వణికాయి. స్వయంగా గోపి అందుకుంటుంటే చూసే యోగం లేదని పించింది.

బహుమతి ప్రదానం తరువాత రాష్ట్ర పతి చెప్పినట్టు "ఈనాడు దేశంకోసం ప్రాణత్యాగం చేసిన వారిపేర్లు చరిత్రలో చిరస్థాయిగా వుంటాయని, వారెన్నటికీ చిరస్మరణీయులని, వారి త్యాగం ప్రజ లెప్పుడూ గుర్తిస్తారని, అట్టి వారిని కన్న తల్లిదండ్రులు ధన్యులని, అట్టి వారిని చేపట్టిన స్త్రీలని అభినందిస్తూ, వారికి జరిగిన వ్యక్తిగత నష్టానికి నా సంతాపసానుభూతులు" అన్నారు

ఆ మాటల్లో ఎంత నిజం వుంది? గోపి చనిపోతేనేం వాడి పేరు చిరస్థాయిగా వుంటుంది! చిన్న వాడైనా, పెద్ద చావు పొందగలిగి, అందరిచేత మన్ననల నందు కుంటున్నాడు బ్రతికినది కొద్దికాలమైనా తన జీవితానికి సార్థకత చేకూర్చుకున్నాడు. ఒక మంచిపని చేశానన్న తృప్తితో చని పోయాడు. ఎందుకూ, మనం అరవయేసి ఏళ్లు బ్రతికాం! బ్రతుకుతున్నాం. మన యీ జీవితంలో ఒక్క మంచికార్యం, నలుగురి చేత అవుననిపించుకునే పని, అంతదాకా ఎందుకు [illegible] తృప్తి నిచ్చేపని ఒక్కటైనా చేశామా? ఎందుకు ఇన్నాళ్లు బ్రతికితేనేం? బ్రతికినది కొద్ది కాలమైనా గోపి చరిత్రలో చిరస్థాయిగా, చిరస్మరణీయుడుగా నిల్చిపోయేటట్టు చేసు కున్నాడన్న నిజం గుర్తించాక మనసు తేలిక పడింది. అలాంటి సుపుత్రుడిని కన్న నేను ఇంక అవివేకంగా దుఃఖించ డంలో అర్థం లేదని పించింది.

దేశం కోసం నా కొడుకుని అర్పించా నన్న తృప్తితో నా దుఃఖాన్ని మరచిపోడానికి నిశ్చయించుకునాను. గోపి అమ్మతో కూడ ఇదే చెప్పాను గోపి గురించి ఇంక బాధ పడను వెర్రిగా!" ఏదో అనిర్వచనీయ మైన అనుభూతి కళ్లలో దోక్త్యమవు తూంటే ఆవేశంగా చెప్పిన మూర్తి మాటలకి, మూర్తిలోని మార్పుకి నేనెంతో ఆశ్చర్య పోయాను.

నిజమే, 'చావన్నది ఒకసారే గదా వస్తుంది' అన్న నిజం గుర్తించి ధైర్యంగా వెళ్లి దేశంకోసం ప్రాణ త్యాగం చేయ డంలో ఎంతటి ఆనందం, తృప్తి వుంటుందో అనుభవించిన వారికి గాని తెలియదేమో!" అని అన్పించింది. ●



అలాగే వుండండి రావుగారూ—కుక్కని లోపల కట్టేసి వస్తాను.

# తారాపథంలో కొత్త వెలుగు



**వ్యాసం : మోహన్‌కుమార్**
**ఫొటోలు: ప్రభాకర్**

ఏప్రిల్‌లో ఓ మధ్యాహ్నంపూట తమ్ముడితో కలిసి వైకుంఠపాళీ ఆడుకుంటున్నది— ఇరవయి ఏళ్ల అందమయిన అమ్మాయి. నిచ్చెన ఎక్కి గబగబా పైకి వచ్చేస్తూండడంలో పక్కన పెద్దపాము ఉన్న విషయం గమనించలేదు. "అక్కా, ఒకటి వేశావంటే పెద్దపాము నోట్లోంచి సరాసరి కిందికి వెళ్లిపోగలవు!" అంటూ తమ్ముడు హెచ్చరించాడు. ఆ అమ్మాయి గుండె జల్లుమన్నది. ఇంత కష్టపడి పైకి వచ్చిందంతా వృథా పోతుందా?.. ఆ స్థితిలో వుండగా మద్రాసు నుంచి ట్రంక్‌కాల్ వచ్చింది. వెళ్లి రిసీవ్ చేసుకుంది.

"పిక్చర్లో యాక్ట్ చేస్తావా?" అంది ఫోన్‌లో అవతలి కంఠం.

"నేను ఫెయిలయ్యానటకదండీ!" ఇవతలి గొంతు సమాధానం.

"ఎవరన్నారు?"

"నేనే అనుకొన్నానండి!" అన్నది అమాయకంగా.



ఏపాత్రనైనా సమర్థవంతంగా నేర్పుతో పోషించగలదు.

"నిర్ణయించేది నువ్వా, నేనా?" కంఠం తీవ్రతకి కొంచెం జంకిందా అమ్మాయి. భయపడుతూ "మీ..మీరే." అన్నది.

"నిన్ను బుక్ చేసుకుంటున్నాను" అంటూ ఫోన్ కట్ చేసింది అవతలి కంఠం. ఆ కంఠం ఆదుర్తి సుబ్బారావుగారిదీ, ఈ కంఠం సుకన్యదీ అని యీపాటికి అర్థమయ్యే వుంటుంది. ఆక్షణాన ఆనందమూ, ఉద్వేగమూ ఒక్కసారే ఉప్పెనలా ముప్పిరిగొన్నవి ఆమెలో.

* * *

శ్రీ కబీర్‌దాస్ (కులదైవం) సుకన్య ఫామిలీ ఫ్రెండ్. ఆయనోసారి సుకన్యను చూసేందుకు వచ్చినప్పుడు శ్రీ ఆదుర్తి కొత్తవాళ్లతో చిత్రం తీయబోతున్నారని చెప్పి, "నీ ఫోటోలేమైనా వుంటే యివ్వు వారికి చూపుతాను!" అన్నారు. "నేనేం పనికొస్తానండీ!" అంటూ నవ్వింది సుకన్య. తనకి సినిమా ఛాన్సేమిటీ, సూర్యుడు పశ్చిమాన ఉదయించినట్లు? "ఎవరికో ఏముందో ఏం చెప్పగలం? ప్రయత్నించి



'ఎప్పుడూ నవ్వుతూ—ఎదటివారిని నవ్విస్తూ'



కొత్తనటి రాధ

చిత్రసమీక్ష

# లేతమనసులు

"పిల్లలూ, దేవుడూ చల్లనివారే" ఇద్దరూ కరుణామయులె పిల్లలు ఏదో తాత్కాలికంగా ఆవేశానికి లోనై ఏదైనా అనుకున్నా తర్వాత ఆ విషయాన్ని మరచి హాయిగా కలిసి ఆడుకుంటారు చిన్నప్పుడున్న ఈ మనస్తత్వం పెరిగి పెద్దవారయిన కొద్దీ క్రమంగా వారి చుట్టూ ఉండేవాళ్ళ, పెరిగే పరిస్థితులను బట్టి పట్టుదలలూ, కార్పణ్యాలూ పెద్దవై చివరికి మనిషిలోని దైవత్వం మాయమై దానవత్వం విజృంభిస్తుంది పెద్దవాళ్ళ పట్టుదలకు పిల్లలు వేదనను అనుభవించాల్సి వస్తుంది అన్న ఇతివృత్తం గల చక్కని కథతో రూపొందించిన చిత్రమే ఏ వి ఎం ప్రొడక్షన్స్ సమర్పించు వీరప్పన్ అండ్ కంపెనీ వారి 'లేతమనసులు'

పెద్దల అహంకారాలకూ, పట్టుదలలకూ గురై విడిపోయి తల్లివద్ద ఒకరూ, తండ్రి చెంత మరొకరుగా ఆయా వాతావరణాలకు అనువుగా పెరిగిన లల్లీ, పప్పీలు దైవికంగా ఒకే స్కూల్లో కల్సుకుని మొదట ఇద్దరూ తగాదాలు పడ్డా చివరికి కల్సి, తాము అక్కచెల్లెళ్ళమని తెల్సుకొని, పంతాలకు పోయి తమ ఆనందాన్ని దూరం చేసిన పెద్దల్ని తెలివిగా ప్రవర్తించి, దైవకృపతో ఒకటిగా చేయటంతో కథ సుఖాంతమవుతుంది

ఈ చిత్రంలో హరనాథ్, రేలంగి, పద్మనాభం, వహాబ్ కాశ్మీరీ, డాక్టర్ రమేష్, కాశీనాథ్ తాతా, దశరథరామి రెడ్డి, జమున, జి వరలక్ష్మి, గీతాంజలి, బేబిపద్మిని, కనకం, మణిమాల, వి ఆర్ తిలకం, సునీత, మంజుల మొదలగువారు నటించారు

చిత్రంలో లల్లీ, పప్పీలుగా చిరంజీవి బేబిపద్మిని అత్యద్భుతంగా నటించింది శేఖర్‌గా హరనాథ, (సత్య)భామగా జమున చక్కని నటనను ప్రదర్శించారు కనక దుర్గమ్మగా జి వరలక్ష్మి ప్రదర్శించిన నటన నిండుగా ఉంది రేలంగి, పద్మనాభం, చక్కని హాస్యాన్నందించారు

గీతాంజలి నృత్యాలు ప్రేక్షకులను ఆకట్టుకునే విధంగానే ఉన్నాయి

మిగతా వారంతా పాత్రోచితంగా నటించారు పాటలన్నీ వినసొంపుగా ఉన్నాయి సంగీతదర్శకుడు ఎం ఎస్ విశ్వనాథన్ వీనుల విందైన సంగీతాన్ని అందించారు రంగులలో చిత్రీకరించిన తిరుపతి దృశ్యాలు ఈ చిత్రంలో ఒక ప్రత్యేక ఆకర్షణ చక్కని ఈ సాంఘిక చిత్రానికి దర్శకులు కృష్ణన్ పంజు

—మాధవ్ ●

## చిత్రలహరి

### కంచుకోట

రాజ్యాధ్యతలు విస్మరించి విలాసాల్లో మునిగి తేలుతున్న విజయేంద్ర భూపతిని, అన్న రాజేంద్ర భూపతి మందలించి అంతఃపురానికి పంపుతాడు పశ్చాత్తాప్తుడైన విజయేంద్రుడు వదినగారయిన రాజేశ్వరీదేవిని క్షమాపణ కోరుకున్నాడు అతని ప్రేమానురాగాలకోసం ఎదురుచూసే భార్య విజయేశ్వరిని చిరకాలానికి కలుసుకున్నాడు ఈ సంతోషం ఎంతోకాలం నిలువనీయలేదు శత్రువర్గం కళ్యాణ సామ్రాజ్య ప్రభువయిన రాజేంద్రభూపతిని రాజద్రోహులు మాయోపాయంతో హత్యచేశారు ఇదివిని విజయేంద్రుడు కుమిలిపోయాడు ఆవేశపూరితుడయినాడు ప్రతీకార వాంఛ చెలరేగింది హంతకులను అంతమొందించేందుకు ఆయత్తుడయినాడు వారితో పోరాడినాడు ఫలితం— వారి చేతుల్లోనే బందీ అయిపోవటం— కళ్యాణ రాజవంశ విచ్ఛేదానికి మూలమయిన యీ సంఘటనలు విశ్వశాంతి పిక్చర్స్ వారి "కంచుకోట" చిత్రంలోనివి ఈనెల 12, 13, 14, 15 తేదీల్లో యీ దృశ్యాలను గోల్డెన్ స్టూడియోలో చిత్రీకరించారు రాజేంద్ర భూపతిగా నాగయ్య, విజయేంద్ర భూపతిగా ఉదయకుమార్,



'లేతమనసులు'లో జమున



'ప్రేమలో ప్రమాదం'లో రామకృష్ణ, జయంతి

ఇంకా ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలలో యన్. టి. రామారావు, సావిత్రి, దేవిక, కాంతారావు, రాజనాల, పద్మనాభం. వాణిశ్రీ మున్నగువారున్నారు. దాశరథి రాసిన ఒక పాట, చిత్రంలో ఆరు నిముషాలపాటు ఉండేది — సుశీల మరి పన్నెండు మంది కలసి ఆలపించారు. కొత్తతరహాలో కంపోజ్ చేసిన ఈ గీతం సంగీత దర్శకుడు మహాదేవన్ ఆధ్వర్యంలో రికార్డు చేశారు. ఈ పాటకు నలభై వాయిద్యాలను ఉపయోగించారు.

## పద్మశ్రీ పిక్చర్స్

పద్మశ్రీ పిక్చర్స్ వారి కొత్త సాంఘికం షూటింగు ఈ నెల 16 నుంచి హైదరాబాద్ శ్రీ సారథీ స్టూడియోలో ప్రారంభించారు. ఉదాత్తమయిన ఈ కుటుంబ గాథా చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య, గుమ్మడి, కాంచన, కాశి కొండలరావు, శాంతకుమారి ముఖ్య భూమికలు పోషిస్తున్నారు. రచన: ముళ్ళపూడి వెంకటరమణ, దర్శకుడు: పి. పుల్లయ్య, నిర్మాత: వి. వెంకటేశ్వర్లు బి.ఎ.

## గౌతమి పిక్చర్స్

షూటింగు వాహినిలో ప్రారంభించారు. 7 వ తేదీ నుంచి జరుగుతున్నది. యన్. టి. రామారావు, సావిత్రి, అంజలీదేవి, గీతాంజలి, పద్మనాభం, ముక్కామల, మిక్కిలినేని, సత్యన్నారాయణ ప్రభృతులు నటిస్తున్నారు. సంభాషణలు: డి.వి. నరసరాజు, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: దాదా మిరాసి.

## పాండవుల బాల్యకథ

శ్రీ విజయశ్రీ ప్రొడక్షన్స్ అనే నూతన చిత్ర నిర్మాణ సంస్థ "పాండవుల బాల్యకథ" చిత్రం నిర్మించనున్నది. ఈ చిత్రంలో తొలిపాట— ఘంటసాల తదితరులు పాడగా, సంగీత దర్శకుడు టి.వి. రాజు ఆధ్వర్యంలో విజయాగార్డెన్స్‌లో రికార్డు చేశారు. షూటింగు అక్టోబరు నుంచి ఆరంభమవుతుంది. రచన: జూనియర్ సముద్రాల, దర్శకుడు: పి. సుబ్రహ్మణ్యం.

## సతీ సుమతి

దర్బారులో నర్తకి మదన మంజరి చేసిన దశావతార వర్ణన నృత్యం చూసి మహారాజు హరిసేనుడు హర్షపులకాంకితుడయినాడు. సుమతి, కౌశికులు కూడ



'ఎదురులేనిమనిషి'లో వాణిశ్రీ



'బర్త్‌డే' కేక్ కట్ చేస్తున్న జమున. శ్రీ రమణారావును, శ్రీ యన్ టి రామారావును కూడ యీ చిత్రంలో చూడవచ్చును

## చిత్రలహరి

యీ నృత్యాన్ని వీక్షించారు హరిసేనుడు మదనమంజరిని ప్రశంసించి రాజనర్తకిగా నియమించడం, ప్రజలు కరతాళధ్వనులు చేయడం మొదలయిన దృశ్యాలన చిన్ని బ్రదర్స్ వారి "సతీసుమతి" చిత్రానికి గాను యిటీవల వీనస్ స్టూడియోలో దర్శకుడు వేదాంతం రాఘవయ్య చిత్రీకరించారు ఫక్తు కూచిపూడి దశావతార నృత్యాన్ని— రాగితాళమయి జనరంజకంగా మార్చి సంగీత దర్శకులు ఆదినారాయణరావు యీ చిత్రంలో ప్రవేశ పెట్టారు హరిసేనుడు యస్ వి రంగారావు, సుమతి అంజలీదేవి, కౌశికుడు కాంతారావు, మదనమంజరి యల్ విజయలక్ష్మి

—మోహన్‌కుమార్ ●

## రాజధానిలో జమున వివాహ వార్షికోత్సవం

సుమారు 1[?] సంవత్సరాల క్రితమే అనుకుంటాను— నాడు 'పుట్టిల్లు' చిత్రంతో కుమారి జమున మద్రాసునే పుట్టిల్లుగా తీర్చిదిద్దుకున్నది

15 ఏళ్ళగా హైదరాబాద్‌లో నివసిస్తున్న శ్రీ రమణరావుతో 1965 ఆగస్టు 4 వ తేదీన తిరుపతిలో వివాహం జరగడంవల్ల శ్రీమతి జమున భాగ్యనగరాన్ని నేడు మెట్టినిల్లుగా రూపొందించుకుంటున్నది నాటి వివాహానికి నగరంలోని మిత్రులు బంధువులు పెద్దలు రాలేకపోయిన కారణంగా ఇటీవల ఈ దంపతులు వివాహ ప్రథమ వార్షికోత్సవాన్ని వైభవంగా జరుపుకున్నారు

ఆ రోజు సాయంత్రం 5—30 కే రవీంద్ర భారతి ఆవరణ అతిథులతో, కార్లతో నిండిపోయింది రవీంద్రభారతికి కుడివైపున కళా భవన్ ఉంది అందులోని సాహిత్య అకాడమీ ఎభాగానికి అభిముఖంగా విశాలమైన పందిరిని అమర్చారు ప్రధాన ద్వారం నుండి ఎడమ వైపుగా కొంచం ముందుకురాగానే జమున రమణారావులు చిరునవ్వులతో ముకుళిత హస్తాలతో నమస్కరిస్తూ పలువురికి గాఢమైన కరచాలనంతో స్వాగతం చెప్పసాగారు దంపతులకు శుభాకాంక్షలు తెలుపుతూ ఆశీస్సులను అందజేశారు అతిథులు. విశ్వ విద్యాలయ అధ్యాపకులు ఇతర మిత్రులు పూల మాలలతో అలంకృతుల్ని చేశారు దంపతులతో పరస్పరం పూల మాలలను మార్పిడి

డాక్టర్ సి నారాయణరెడ్డి తులను అభినందించారు

జమున రమణారావు పట్టుకొని అతిథుల మధ్య ఛలోక్తులు విసురుతూ టేవిర్చి తర్వాత రవీంద్ర తులు పూలమాలలను

తెలుగు సంప్రదాయం తన భర్త పేరును దాదా ధుల సమక్షంలో తీయ చింది ఆ తర్వాత యిడా జరిగింది అనంతరం ఎదితో ముచ్చటిస్తూ శ్రీ విశ్వ విద్యాలయంలో యమ్ తర్వాత నిజాం కాలేజిలో పని చేశారని తెలియ జేసాడ ఓస్మాన విశ్వవిద్యాలయంలో డీ చేస్తున్నారు ఏప్రిల్‌లో పు తర్వాత ఆయన విదేశాలక విద్య అభ్యసిస్తారు

శ్రీ రమణరావుతో పాటే శాలకు వెళ్ళడానికి పని త పోయినా తర్వాత భర్త ప్రధానమైన నగరాలను రావడానికి శ్రీమతి జమున

—సుదర

చేయించారు మరికొందరు.

అనిర్వచనీయమైన ఆనందా వ్యక్తం చేసే చిరునవ్వులు జము ముఖాలపై చిందేయి. వచ్చిన పురగా జమునకు అపరిచితులు రావు తన మిత్రులను, అధ్యాప ప్రొఫెసర్లను పరిచయం చేసారు కంగా జమున వారికి నమస్క

హోంమంత్రి శ్రీ మీర్ అహ ముందుగానే వచ్చి శుభాకాంక్షలు కాన్ఫెరెన్స్‌కి ఆర్థిక మంత్రి వచ్చి దంపతులను ఆశీర్వదించి సించారు. ఆ రోజే సదరన్ మూవీటోన్‌లో 'రహస్యం' షూటింగ్ నటీనటులు కొందరు ఈ నారు. అక్కినేని నాగేశ్వరరావు పూర్ణ వచ్చి దంపతులను అ

నిర్మాతలు — దుక్కిపాటి శంకర్‌రెడ్డి, రాజేంద్రప్రసాద్, యణ, తమ్మారెడ్డి కృష్ణమూ దర్శకులు — ఆదుర్తి సుబ్బారా నటులు — కాంతారావు, గుమ్మ స్టూడియోస్ నిర్వాహకులు శ్రీ రావు సదరన్ మూవీటోన్ శ్రీ రామకృష్ణారెడ్డి, కైనారు సినీ రచయితలు

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Chetty Street, Madras 1. Chief Editor, S. Sambhu Prasad.